# తత్త్వముల వివరము



రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org







# తత్త్వముల వివరము


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-41 ఆరవ ముద్రణ : జూన్-2019

ప్రతులు : 1000 **వెల : 80/-**



www.thraithashakam.org

**"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు**

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

త్రైత శకం

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

www.thraithashakam.org

77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
99) ౧౦౦, శతము, 100
100) సుప్రసిద్ధి బోధ.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.

88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము. 126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు. 130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య. 132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం. 138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. కుశాల్ కుశాల్ లంజమ్మ
నా నెత్తిమీద రెండు తన్నమ్మ.
146. రాజాధి రాజా - దేవాధి దేవా.
147. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**

**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.



www.thraithashakam.org

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
**(ప్రెసిడెంట్)**
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

www.thraithashakam.org

'తత్' అనగ 'అది' అని అర్థము. 'త్త్వం' అనగ 'నేను' అని అర్థము. **'తత్త్వం'** అనగా **'అది నేను'** అని చెప్పవచ్చును. నేను అనువాడు జీవుడు, జీవునికంటే వేరుగ ప్రక్కనే ఉన్నవాడు ఆత్మ (దేవుడు). జీవాత్మ, ఆత్మల వివరమే తత్త్వములో ఉండును. జీవాత్మ, ఆత్మల వివరము లేనిది తత్త్వము కానే కాదని చెప్పవచ్చును. తత్త్వజ్ఞానము చాలా విలువైనది. ఆత్మ జీవాత్మలు శరీరములోనే ఉండును. కావున తత్త్వ వివరమంతయూ శరీరములోనే ఇమిడివుండును. అందువలన తత్త్వ వివరము తెలుపువారు శరీరము లోపలే చెప్పాలి. శరీరము విడిచి బయట చెప్పితే అది పూర్తి అసత్యమగును.

అసలు విషయమేమంటే "తత్త్వం" అని పేరు పెట్టిన పాటలుకానీ, పద్యములుకానీ ఎవరికీ అర్థముకాని రీతిలో ఉంటాయి. ఎవరైనా తత్త్వము వ్రాస్తే అలాగే వ్రాయాలనీ ఆనాటి పెద్దలు నిర్ణయించుకొని తీర్మాణించారు. ఆ పద్ధతి ప్రకారమే తత్త్వాలన్నీ వ్రాయబడినవి. అలా అర్థముకాని రీతిలో ఎందుకు వ్రాయాలి? అని కొందరడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! మన పెద్దలు కొంత ధనమును సంపాదించారు అనుకొందాము. ధన సంపాదన వెనుక ఎంతో శ్రమ ఉండును. శ్రమపడి సంపాదించినది కావున ఆ ధనమునకు కూడా ఎంతో విలువ ఉండును. దాని విలువను గుర్తించిన వారు ధనమును ఒక పెట్టెలో పెట్టి, ఆ పెట్టెకు ఒక తాళము కూడా వేసి ఉందురు. లోపలి ధనము కావాలంటే తాళమును తెరచు తాళము చెవి కావాలి. అలా ఉన్నప్పుడే ధనమునకు విలువుండును. ఎదుటివాడు దాని విలువను తెలుసుకొనును. అలా లేకపోతే ధనము ఆరుబయట ఉంటే దాని విలువను గుర్తించలేరు. ఇష్టమొచ్చినట్లు వాడుకొని అసలే లేకుండా చేసుకొందురు. పూర్వము పెద్దలు జ్ఞానమను ధనమును సంపాదించి ప్రపంచ ధనమును దాచినట్లు పెట్టెలో పెట్టి తాళము వేయలేదు.

www.thraithashakam.org

కాని ఒక గుడ్డలో మూటగట్టి ముడివేశారు. ఆ మూటలను మన ఎదుటే పెట్టి పోయారు. ఆ మూటల ముడి విప్పితే అందులోని జ్ఞానధనము సులభముగా దొరుకును. మూటలు ముందున్నా మనము ముడి విప్పుకోలేని వారమైనాము. కావున వారు కొంత మరుగుపెట్టి వ్రాసినవి తెలియకుండా పోయినవి. అందువలన తత్త్వముల వివరములు ఎవరూ చెప్పుకోవడము లేదు.

'అందని ద్రాక్ష పుల్లన' అన్నట్లు కొందరికి తత్త్వములు అర్థముకాక వాటిని తిక్క మాటల క్రిందికి జమకట్టారు. ఇవి వేదాలు కాదు, ఉపనిషత్తులు కాదు వీటిని ఎందుకు చదవాలని అంటున్నారు. ఎవరు ఏమనినా తత్త్వాలలో ఉన్నది జ్ఞానము యొక్క సారాంశమను మాట వాస్తవము. పూర్వము బోధకులైన గురువులు జ్ఞానము చెప్పునపుడు కూడా రహస్య ప్రదేశములోనే చెప్పెడివారు. బయటి అజ్ఞానుల ఎదుటకానీ, జ్ఞానము మీద ఆసక్తి లేనివారి ఎదుటకానీ చెప్పెడివారు కాదు. పూర్వకాలములో అందరూ అదే పద్ధతిని కొనసాగించుచుండిరి. కావున వారు తత్త్వములను కూడ నిగూఢముగానే వ్రాసి, అందరికీ అర్థము కాకుండా చేశారు. ఎవరికైతే జ్ఞానము మీద జిజ్ఞాసయుండునో వారికి మాత్రము అర్థమగునట్లు వ్రాశారు. బయటి చూపును వదలి లోచూపు పెట్టుకొన్న ఎవరికైనా తత్త్వములు ఎంత నిగూఢముగా ఉండినప్పటికీ అర్థము కాగలవు.

నేటి సమాజములో ఎందరో గురువులుగ చలామణి అగుచున్న బోధకులు, స్వాములు, పీఠాధిపతులు గలరు కదా! తత్త్వముల వివరము గురించి వారికి కూడా తెలియదా? అని కొందరడుగవచ్చును. దానికి మా జవాబు ఎవరైతే తత్త్వములుగ వ్రాయబడిన పాటలలో జ్ఞానము

లేదంటున్నారో, వారు ఎవరైనా వారికి శరీరములోని ఆత్మజ్ఞానము తెలియదనియే చెప్పవచ్చును. నేడు బోధకులందరూ ఎక్కువ శాతము బయటి జ్ఞానమునే బోధిస్తున్నారు. కొందరైతే ఏ జ్ఞానములేని రామాయణ ఇతిహాసములను చెప్పుకుంటున్నారు. ఈ విధముగా జరిగిపోయిన చరిత్రను జ్ఞానమనుకోవడము వలన, ఇంతకు ముందు జ్ఞానిగా ఉన్నవాని చరిత్రను చెప్పుకోవడము వలన, మనకు జ్ఞానము కలుగుచున్నదా? లేక కాలక్షేపణ జరుగుచున్నదా? అని యోచించక పోవడము వలన ఎవరి దారిని వారు సమర్థించుకొంటున్నారు. అటువంటి వారికి తత్త్వములలోని జ్ఞానధనము లభించదు.

"తత్త్వం" ను విడదీసి చూచితే తత్+త్వం అని తెలుసుకొన్నాము. తత్త్వం అన్నది అన్ని మతములలోను గలదు. ముఖ్యముగ హిందూ (ఇందూ) మతములోనూ, క్రైస్థవ మతములోనూ బాగా కనిపిస్తున్నది. అయినప్పటికీ ఇటు హిందువులకు, అటు క్రైస్థవులకు దీని అర్థ భావములు తెలియకుండా పోయినవి. హిందువులలో సంస్కృతమును నేర్చినవారు అర్థము చెప్పగలుగుచున్నారు. కాని భావము తెలియకుండా పోయినది. ప్రతిపదార్థము చెప్పిన వారికి భావము ఏమిటో తెలియదు. తత్ అనగ తనకు భిన్నముగ ఉన్న ఆత్మ అని అనుకోవడములో పొరపడుచున్నారు. ఎందుకనగా **భగవద్గీతలో కానీ, బైబిలులోకానీ మూడు ఆత్మలు సిద్ధాంత సహితముగ చెప్పబడియున్నవి. ఆ త్రైతాత్మ సిద్ధాంతమును ఎవరూ గుర్తించని కారణమున తత్ అనబడునది రెండవ ఆత్మనో, మూడవ ఆత్మనో తెలియకుండా పోయినది.** కొందరికి ఆత్మల వివరమే అర్థముకాక తాను మొదటి ఆత్మనైన జీవాత్మననే తెలియదు. ఇక క్రైస్థవులలోనికి వస్తే మూడవ ఆత్మను అటుంచితే రెండవ ఆత్మ వివరము కూడా తెలియదు. ఈ విధముగా ప్రపంచములో అతి

పెద్దదైన క్రైస్థవ మతమందుగానీ, ఇక్కడ ఒక స్థాయిలోనున్న హిందూ మతములోగానీ రెండవ ఆత్మ వివరము తెలియకుండా పోయినది.

తత్+త్వం = తత్త్వం అని వివరించుకొని చెప్పువారున్నప్పటికీ, "త్వం" కు అర్థము తెలిసినప్పటికీ, ఆ "తత్" అనేది ఏదో స్పష్టముగ ఎవరికీ తెలియకుండా పోయినది. ఒకవేళ కొందరిలో మాకు తెలుసునను ధీమా ఉండినప్పటికీ అది వారి గ్రుడ్డినమ్మకమే కానీ అసలైన జ్ఞానదృష్టి లేదని చెప్పవచ్చును. అందువలన తత్ అనగ పరమాత్మ అని చెప్పుచున్నారు. ఒక జీవాత్మ పరమాత్మలో ఐక్యమైపోతే వానికి జన్మ ఉండదు. అలా ఐక్యమైనవాడే కర్మలేనివాడై శరీరముతో లేకుండును. ఇక్కడ అసలైన వివరానికి వస్తే పూర్వము తనలోని ఆత్మను తెలిసిన జ్ఞానులు ఆత్మతో కలిసి యోగము పొందినవారైవున్నారు. అటువంటి జ్ఞానులు ఆత్మతో కలియకముందు "తత్త్వం" అన్నవారు ఆత్మతో కలిసిన తర్వాత "తత్త్వమసి" అన్నారు. దీనిని విడదీసి చూచితే తత్+త్వం+అసి= తత్త్వమసి అనిగలదు. **తత్ అనగ ఆత్మ అని, త్వం అనగ నేను అని, అసి అనగ కలసిపోయాము** అని అర్థము. ఆత్మతో కలసినవాడు భూమి మీద శరీరముతో ఉండి బ్రహ్మయోగిగా ఉండును. అందువలన శరీరముతో బ్రతికివున్నవాడు "తత్త్వమసి" అనగలిగాడు. అదే పరమాత్మతో కలసిపోతే వానికి శరీరముండదు కావున వాడు ఏమియు అనే దానికుండదు. అందువలన ఆత్మను అనగ తత్‌ను తెలుసుకొన్న జీవుడు త్వం అన్నవాడు తత్‌లో కలసిపోయి తత్త్వమసి కాగలడు. ఇప్పటికైనా తత్త్వం అను పదమునకు అర్థము తెలిసి, జీవాత్మ ఆత్మలను తెలుపు పాటలకు, పద్యములకు తత్త్వమనిత పేరు పెట్టారని తెలిసి, రెండు ఆత్మలు శరీరములోనే ఉన్నాయని తెలిసి, తత్త్వమునకు శరీరాంతర్గతములోనే అర్థము చెప్పుకోవలెను. ఇదే సూత్రమును

www.thraithashakam.org

అనుసరించి **"తత్త్వముల వివరము"** అను ఈ గ్రంథములో వ్రాసిన పాటలకు, పద్యములకు శరీరములోనే వివరించి చెప్పాము. 'వేయి పుస్తకములు చదువుటకన్న వేమన పద్యమొకటి చదువుట మిన్న' అన్నట్లు, వేయి పాటల తత్త్వములను పాడుకొనుటకంటే ఒక్క తత్త్వమునకు వివరమును తెలియుట మిన్న. అందువలన తత్త్వములను పాడుకొనుటలో ఉపయోగములేదు కానీ తత్త్వమును అర్థము చేసుకొంటే అది ఉపయోగమై "తత్త్వమసి" కాగలవు.

ఇట్లు

**త్రిమత ఏకైక గురువు, త్రైత సిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**


తప్పక చదవండి ! ప్రథమ దైవగ్రంథము చదివించండి !!

# త్రైత సిద్ధాంత భగవద్గీత

**(578 శ్లోకములతో)**

వెల:500/-

త్రిమత ఏకైక గురువు, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

ఇది ఆధ్యాత్మిక విద్యలో విప్లవాత్మక మలుపు తిప్పిన భగవద్గీత. 55 శ్లోకములకు పూర్తి భావమార్పుతో ఏర్పడినది. మూడు ఆత్మల గురించి శాస్త్రీయంగా వివరించి బోధించిన మొట్టమొదటి భగవద్గీత. ముందు ఎందరో వ్రాసిన భగవద్గీతలకు నూటికి 90 పాళ్ళు విభిన్న భావములతో కూడుకొన్నది. ఎన్నో ప్రత్యేకార్థములతో దేవుడు చెప్పిన నిజ భావములను హేతుబద్ధముగా వివరించినది మరియు హేతువాదులు సహితము ఖండించలేని భగవద్గీత ఇది ఒక్కటే. గర్భస్థ శిశువుకు ప్రాణము లేదనడము, హత్యను వివరించి ఆత్మహత్యగ, అలాగే ఆత్మహత్యను హత్యగ చెప్పడములాంటి చాలామందికి కొరుకుడుబడని విప్లవాత్మక, సంచలన విషయములెన్నో ఈ గ్రంథములో గలవు. శ్రీకృష్ణుని యదార్థభావమును తెలిపి, వాస్తవ జ్ఞాన పథములో నడిపి, మోక్షగమ్యమును చేర్చునదీ గ్రంథ రాజము.

# 1. తత్త్వము

సీ॥ కానని భూమిలో కస్తూరి కోనలో
మందరగిరి మీద మర్రి చెట్టు
చెట్టుకు కొమ్మలు చెర్చింప పది నూర్లు
కొమ్మ కొమ్మకు కోటి కోతులుండు
నగదరం బైనట్టి నడికొమ్మ మీదను
నక్క యొకటుండు చుక్కవలెను
సుస్థిరం బైనట్టి చుక్కకు తూర్పున
సూర్య చంద్రాదులు తేజరిల్లు

తే॥ దీనికర్థంబు చెప్ప దేశికునకు
నెలలు పండ్రెండు గడువిత్తు నేర్పుతోడ
చెప్పగలిగనేని నేనిత్తు చిన్న మాడ
చెప్పలేకుంటె నేనగుదు చిన్న నగువు.

**భావము :-** దైవము నిల్వయున్న నిజమైన దేవాలయమైన మన శరీరములో, కంటికి కనిపించని, చూడబడని అంతర్గతములో ఎముకలచే మరియు వెన్నుపూసలచే పేర్చబడిన శరీర భాగములో, ఎత్తైన కపాల స్థానమందు జీవుల సారాంశమంతయూ ఇమిడి ఉన్నది. ఆ స్థానములోనే జీవరాసుల జరిగిన, జరుగుచున్న, జరుగబోవు చరిత్రలన్నీ దాచబడినవి. శిరో భాగములో మధ్యనగల గుణచక్రమందు గుణములు, కర్మచక్రమందు కర్మ, కాలచక్ర మందు కాలము కనిపించక సూక్ష్మముగా ఉన్నవి.

కనిపించు మెదడునుండి ఒకనాడి బయలుదేరి గుదస్థానము వరకు వ్యాపించివున్నది. దీనినే బ్రహ్మనాడి అందురు. ఈ నాడియందు కాల,

కర్మ, గుణచక్రములను నడుపు ఆత్మ నివాసమై ఉన్నది. ఆత్మ కంటికి కనిపించక బ్రహ్మనాడి పై భాగమునుండి చివరి భాగమువరకు వ్యాపించి యున్నది. చిన్న చిన్న నరములు అనేకము శరీర వివిధ భాగముల నుండి వచ్చి బ్రహ్మనాడితో కలిసియున్నవి. ఈ చిన్న నరముల ద్వారానే శరీరమందు ఏ విషయమైనా బ్రహ్మనాడిని చేరి అక్కడినుండి కపాల స్థానములో నివాసమున్న జీవునకు చేరుచున్నది. ఇంతేకాక బ్రహ్మనాడికి ముందర భాగములో ఇరువైపులా సూర్య చంద్రనాడులనునవి కలవు. ఈ నాడులు రెండు ముఖ్యముగా ఊపిరితిత్తులతో సంబంధము ఉన్నవి. మన ముక్కు రంధ్రముల ద్వారా ఆడుశ్వాస సూర్యచంద్రనాడుల ద్వారానే కదలింపబడు చున్నది.

పై విధముగ శరీర అంతర్భాగమున్నది. ఈ విషయమును యోగులైనవారు పద్యరూపములో చెప్పారు. లోపలి భాగము కనిపించనిది. కావున 'కానని భూమిలో'నన్నారు. శరీరము ఆత్మ నిలయమైన పవిత్ర స్థానము కావున 'పరిమళముగల కస్తూరికోన' అన్నారు. శరీర పై భాగమున ఆత్మ, జీవుడు,గుణములు, కర్మలకు నిలయము కావున శరీరమును పర్వతముగ పోల్చి 'మందరగిరి' అన్నారు. కపాలస్థానము నుండి బ్రహ్మనాడి పుట్టినది కావున దానిని 'మఱ్ఱిచెట్టుగ' చెప్పారు. బ్రహ్మనాడి నుండి ఎన్నో నాడులు చీలిపోయాయి. కనుక నాడులన్నిటిని కొమ్మలుగ పోల్చి 'చెట్టుకు చెర్చింప పదినూర్ల కొమ్మలన్నారు.' బ్రహ్మనాడితో సంబంధమున్న నరముల ద్వారా లెక్కకురాని అనేక విషయములు బ్రహ్మనాడిని చేరుచున్నవి. కావున 'కొమ్మకొమ్మకు కోటి కోతులుండు' అన్నారు. చిన్న నరములన్నిటికి బ్రహ్మనాడియే ఆధారము. బ్రహ్మనాడినుండియే శక్తి అన్ని నరములకు ప్రవహించుచున్నది. అందువలన బ్రహ్మనాడిని 'నగధరం బైన నడిమికొమ్మ'

అన్నారు. బ్రహ్మనాడియందే అన్నిటికీ సాక్షియైన ఆత్మ నివాసమున్నది. కావున ఆత్మను నక్కగ పోల్చి 'నడిమి కొమ్మ మీద నక్క ఒకటి'యని అన్నారు. ఆత్మ స్థిరస్థాయిగ ఒక్క చోటుండి, తనశక్తి కిరణములను నరముల ద్వారా శరీరమంతా వ్యాపింపజేయుచున్నది. అందువలన పగలు రేయి స్థిరస్థాయిగ ఉన్న చుక్కగ ఆత్మను పోల్చి 'నక్క ఒకటుండు చుక్కవలె' అన్నారు. బ్రహ్మ నాడికి కొద్దిగ ముందు, ప్రక్కన రెండువైపులా సూర్యచంద్రనాడులున్నాయి. జాగ్రదావస్థయందు మాత్రము మనస్సుకు స్థానమైవున్న సూర్యచంద్ర నాడులను 12 గంటల కాలము కనిపించి, 12 గంటల కాలము కనిపించని సూర్యచంద్రులుగ పోల్చి 'చుక్కకు తూర్పున సూర్యచంద్రులు తేజరిల్లు' యన్నారు.

ఇది నిగూఢ భావముగల పద్యము. శరీర అంతర్గత జ్ఞానము పూర్తిగా తెలిసినవారికే ఈ పద్యము అర్థమగును. శరీరాంతర్గత జ్ఞానము చాలామందికి లేనిదానివలన దీని అర్థము చెప్పుటకు చాలా కాలము పట్టునను ఉద్దేశముతో 'నెలలు పండ్రెండు గడువిత్తునని' చెప్పారు.

## 2. తత్త్వము

**ఆహా బ్రహ్మాండమైనది ఆదిమంత్రము మన బ్రహ్మంగారు చెప్పినది పెద్ద మంత్రము.**

**1) రెక్కముక్కులేని పక్షి రేయి పగలు తపస్సు చేసి ఒక చెరువు చేపలన్ని ఒక్కటే మ్రింగెను. "ఆహా"**

**2) ఇంటి వెనుక తుట్టెపురుగు ఇంటిలో అందరిని మ్రింగె, చూడవచ్చిన జనులనెల్ల చూచిమ్రింగెను. "ఆహా"**

**3) కాళ్లు చేతులు లేనివాడు కడవ ముంత చేత పట్టి నిండుబావి నీళ్లని ఒక్కడే ముంచెను "ఆహా"**

**4) ఏటిమీద స్వాతికొంగ వేటలాడుచురాగ చాటునున్న మీనుపిల్ల అట్టే మ్రింగె "ఆహా"**

**5) చెప్పినాడు వీరదాసు చోద్యముగాను ఆత్మతత్త్వము గొప్పవారు దీని భావము విప్పిచెప్పితే చాలు "ఆహా"**

**దీని అర్థమేమనగా :-** శ్వాసను కుంభించి నిలిపి మనస్సును బ్రహ్మనాడి యందు చేర్చవలయునని అనుకొన్న యోగి ఒక స్థలమునందు కదలక కూర్చొని మొదట శ్వాసను ఊపిరితిత్తులనిండా ఏమాత్రము ఖాళీ లేకుండా పీల్చును. పీల్చిన శ్వాసను ఏమాత్రము బయటికి వదలకుండా మూడు లేక నాలుగు నిమిషములుండును. ఇట్లున్న తర్వాత మరియు బయటి గాలినే లోపలికి పీల్చును. ఇక్కడ గమనింపవలసిన విషయము మొదట ఊపిరితిత్తులు ఏమాత్రము ఖాళీ లేకుండా గాలి పీల్చినాడు కదా! ఖాళీలేని ఊపిరితిత్తులందు తిరిగి గాలి ఎట్లు ప్రవేశించినదని? అనుమానము కలుగ వచ్చును. దానికి సమాధానము మొదట ఖాళీలేని ఊపిరితిత్తులందు మూడు నాలుగు నిమిషముల తర్వాత కొద్దిగా ఖాళీ ఏర్పడియుండును. ఆ ఖాళీస్థలము ఎట్ల ఏర్పడినదనగా! ఊపిరితిత్తులయందున్న గాలి మూడు నాలుగు నిమిషములకు బయటికి రావలయునని ప్రయత్నించును. కాని బయటికి రాకుండ నిరోధించి ఉన్నందు వలన ఊపిరితిత్తులలోని మూలలకు గాలి చేరుట వలన ఊపిరితిత్తులు కొద్దిగా ఖాళీ ఏర్పడి ఉండును. ఆ ఖాళీ పూర్తి అగునట్లు రెండవసారి యోగి బయటి గాలిని పీల్చి పూరించుచున్నాడు. ఇట్లు రెండవమారు గాలిని పీల్చిన యోగి మూడు లేక నాలుగు నిమిషముల వరకు శ్వాసను బయటికి వదలక ఉండి, తర్వాత ఇంకా తనయందు గాలి

ప్రవేశించునేమోనని మూడవమారు పీల్చి చూచును. అప్పుడు కూడా గాలి కొద్దిగా లోపలికి పోవును. ఇట్లు రెండు మూడుమార్లు శ్వాసను పీల్చి ఉదరమునందు, ఊపిరి తిత్తులందును గాలిని భర్తీగా చేసుకొని బయటికి వదలక ప్రయత్న పూర్వకముగా బిగించి ఉండును దీనినే "కుంభకము" అని అందురు. ఈ విధముగా కుంభింపబడిన గాలి బంతియందు బంధింపబడి ఉన్నట్లుండును.

1) గాలిని ఆధారము చేసుకొని ఆడుచున్న ఊపిరితిత్తులు గాలి కదలక నిలిచిన వెంటనే నిలిచిపోవుచున్నవి.

2) ఊపిరితిత్తులు నిలిచిన వెంటనే ఊపిరితిత్తులను నడుపుచున్న నరము లందు చైతన్యము కూడా నిలిచిపోవును.

3) నరములందు చైతన్యము నిలిచిన వెంటనే ఆ నరములతో సంబంధమున్న సూర్యచంద్రనాడులందుండు చైతన్యము నిలిచిపోవును.

4) సూర్యచంద్రనాడులందు చైతన్యము నిలిచిన వెంటనే సూర్యచంద్ర నాడులను ఆధారముగా చేసుకొని చలించుచున్న మనస్సు కదలక నిలిచిపోవును.

5) మనస్సు నిలిచిపోయిన వెంటనే మనస్సును ఆధారముగా చేసుకొని జీవులను నడుపుచున్న ఆరు కేంద్రములలో చైతన్యశక్తి నిలిచిపోవును. అనగా కుండలీశక్తి ఆట కతట్టబడినదన్నమాట. నరకేంద్రముల చైతన్యము నకు ఆధారమై ఉన్న ఏడవ కేంద్రము ఒక్కటి తన శక్తిని కోల్పోక ఉండును. ఆరు కేంద్రముల చైతన్యశక్తి నిలిచిపోయిననూ ఏడవ కేంద్రమందున్న చైతన్యశక్తి నిలిచిపోక ఉండును. ఏడవ కేంద్రమందలి శక్తి అపారమైనది,

www.thraithashakam.org

ఊహించరానిది, చెప్పుటకు శక్యముకానిది, దానినే 'ఆత్మ' అని యోగులు అంటున్నారు. ఈ ఏడవ కేంద్రమునందలి చైతన్యము జీవుని నిదుర, మెలుకువ, స్వప్నములందు సమానముగ ఉండును. అందువలన ఏడవ కేంద్రమందున్న చైతన్యమునే మూడవస్థలయందు సాక్షిగా ఉన్నదని చెప్పవచ్చును. కుంభకము ద్వారా నిలిచిన మనస్సు బ్రహ్మనాడియందు ఏడవ కేంద్రము చేరి అందు ఇమిడి పోవుచున్నది. మనస్సుతో పాటు అంతఃకరణములైన జీవుడు కూడా ఏడవ కేంద్రములో ఉన్న ఆత్మయందే లీనమై పోవుచున్నాడు. జీవుడు ఆత్మయందు లీనముకావడమునే **"యోగము"** అంటున్నారు.

కుంభకమునే పూర్వము యోగి అయిన శ్రీ వీరబ్రహ్మంగారు ఒక తత్త్వముగా చెప్పియున్నారు. కుండలీశక్తిని వేరుగా పోల్చుకొన్నవారు, కుండలీశక్తి నిదుర పోతున్నదన్నవారు ఉండుటవలన ఆ తత్త్వమునకు అర్థమే తెలియకపోయి, ఆఖరుకు బిక్షగాళ్లు పాడుకొనుటకు ఉపయోగపడు చున్నది. 'గ్రుడ్డివానికి రత్నము ఇచ్చిన వ్యర్థమైనట్లు' శ్రీ వీరబ్రహ్మముగారు ఎంతో జ్ఞానమును ఉపయోగించి చెప్పిన మాటను తెలియని మనము వ్యర్థము చేయుచున్నాము. కుండలీనే పెద్దగ పెట్టుకొన్నవారు మరియు విన్నవారు, శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారు చెప్పిన క్రింది తత్త్వమును గ్రహించవలయునని తెలుపుచున్నాము. గొప్ప మంత్రము బ్రహ్మముగారు చెప్పినది. ఆ మంత్రము మన శ్వాసయే. శ్వాస లోపలికి ప్రవేశించినపుడు "సో" అను శబ్దముతో, బయటికి వచ్చునపుడు "హం" అను శబ్దముతో చలించుచున్నది. ఈ రెండు శబ్దములు కలసి "సోహం" అను శబ్దము ఏర్పడినది. ఈ శబ్దము మహిమకలది కావున దీనిని 'మంత్రము' అని చెప్పాడు. మరియు అక్షర సమ్మేళనములతో కూడుకొన్నది. కావున

www.thraithashakam.org

మంత్రము అని చెప్పబడినది. "సోహం" అను మంత్రము ఆది మంత్రముగా మారుచున్నది. అది ఏ విధముగననగా! "సో" అను శబ్దమునందు చివరిగా "ఓ" అను శబ్దమున్నది. "హం" అను శబ్దమునందు చివరిగా "మ్" అను శబ్దమున్నది. ఒక్కమారు శ్వాస లోపలికి పోయి బయటికి వస్తే "సోహం" అను మంత్రము ఏర్పడుచున్నది. అ సోహం మంత్రమునందే "ఓమ్" అను శబ్దము ఇమిడి ఉన్నది. కావున "సోహం" తల్లి "ఓమ్" శిశువు. "ఓం" ప్రపంచ పుట్టుకలో మొదట పుట్టిన శబ్దము కావున దీనిని 'ఆది మంత్రము' అనుట సంభవించినది.

**1. రెక్క ముక్కులేని పక్షి రేయి పగలు తపస్సు చేసి ఒక చెరువు చేపలన్ని ఒక్కటే మ్రింగెను. "ఆహా"**

ముక్కు పుటములందు ప్రవేశించు శ్వాసకు ఆకారము లేదు కావున 'రెక్క ముక్కులేని పక్షి' అని చెప్పబడినది. శ్వాస రేయి పగలు విడువక సోహం అను మంత్రమును జపించుచున్నది. కావున 'పక్షి రేయి పగలు తపస్సు చేసే' అని చెప్పబడినది. ఈ శ్వాసయే శరీరము లోనికి ప్రవేశించి కుంభకము ద్వారా నిలిచి శరీరములోనున్న కదలికల (చైతన్యముల) అన్నిటినీ నిలిపివేయుచున్నది. కావున చెరువులో అనేక విధములుగా 'చలించు చేపలన్నిటిని మ్రింగెను' అని చెప్పబడినది.

**2) ఇంటి వెనుక తుట్టెపురుగు ఇంటిలో అందరిని మ్రింగె, చూడవచ్చిన జనులనెల్ల చూచిమ్రింగెను. "ఆహా"**

శ్వాస ఎల్లవేళల "సోహం" అను శబ్దము చేయుచున్నది కావున 'గీ' మని అరచు తుట్టెపురుగుగా చెప్పబడినది. శ్వాసకు ఆధారము శరీరములో కనపడక ఉన్న బ్రహ్మనాడిలోని చైతన్యము కావున 'ఇంటి

www.thraithashakam.org

వెనుక పురుగు' అని చెప్పబడినది. ఇల్లు అనగా శరీరము. శ్వాస కుంభకము ద్వారా శరీరములోనున్న వ్యాన, సమాన, ఉదాన, అపాన వాయువులన్నియూ బంధింపబడుచున్నవి. కావున 'ఇంటిలోని అందరిని మ్రింగెను' అని చెప్పబడి ఉన్నది. శ్వాస కుంభించిన తర్వాత ఊపిరితిత్తుల ఖాళీవల్ల రెండు లేక మూడుసార్లు కొద్దికొద్దిగా బయటి గాలి లోపలికి ప్రవేశించి, ప్రవేశించిన గాలి తిరిగి బయటికి రాక నిలుచుటవలన 'చూడవచ్చిన జనులనెల్ల చూచి మ్రింగెను' అని చెప్పబడి ఉన్నది.

**3) కాళ్లు చేతులు లేనివాడు కడవ ముంత చేత పట్టి నిండుబావి నీళ్ళని ఒక్కడే ముంచెను "ఆహా"**

శ్వాసకు రూపము లేదు. కావున 'కాళ్లు చేతులు లేనివాడని' చెప్పబడినది. శ్వాస ముక్కురంధ్రములలో ఒక దానియందు ఎక్కువ, ఒక దానియందు తక్కువ లోపలికి బయటికి చలించుచున్నది. ఎక్కువ శ్వాసను కడవ అనీ, తక్కువ శ్వాసను ముంతనీ చెప్పడమైనది. కావున 'కడవ ముంత చేతపట్టి' అని చెప్పడమైనది. శరీరములోని తలంపులన్ని శ్వాస ఒక్కటి నిలువడము వల్ల నిలిచిపోవుచున్నవి. కావున 'బావి నీళ్ళన్ని ఒక్కడే ముంచెను' అని చెప్పబడి ఉన్నది. శరీరమును బావిగా పోల్చడమైనది.

**4) ఏటిమీద స్వాతికొంగ వేటలాడుచురాగ చాటునున్న మీనుపిల్ల అట్టే మ్రింగె "ఆహా"**

శ్వాస శరీరములో నిలిచిపోయిన దాని వలన మనస్సు నిలచి పోవుచున్నది. మనస్సు నిలచిపోవుట వలన ఊపిరితిత్తులు తర్వాత నరములు, ఆ తర్వాత సూర్యచంద్రనాడులు, షట్ చక్రములు ఒక దాని తర్వాత ఒకటి తమ తమ చైతన్యమును కోల్పోవుచున్నవి. కావున 'ఏటి

www.thraithashakam.org

మీద స్వాతికొంగ వేటలాడుచురాగ' అని చెప్పబడినది. ఒక దాని తర్వాత ఒకటి తమ చైతన్యములను కోల్పోయిననూ, ఆఖరున గల ఏడవ కేంద్రము మనస్సు వలన తన శక్తిని కోల్పోక నిలచిన దానివలన అన్నిటి యొక్క చైతన్యములను నిలిపి వేసిన మనస్సు ఏడవ కేంద్రము వద్దకు వచ్చి తనశక్తి చాలక నిలిచిపోయిన దానివలన 'చాటునున్న చేపపిల్ల కొంగను మ్రింగెను' అని చెప్పడమైనది.

## 3. తత్త్వము

**చందమామ చందమామ చందమామ, ఈ సంధి తెలిపే జ్ఞానులెవరె చందమామ**

**1) కాయమను పుట్టలోను చందమామ, పాము మాయగానే మెలగుచుండు చందమామ ॥చం॥**

**2) జంట నాగ స్వరములూది చందమామ, పామును పాదు పెకళింపవలెను చందమామ ॥చం॥**

**3) తొమ్మిది వాకిళ్లు మూసి చందమామ, పామును నెమ్మదిగ పట్టవలెను చందమామ ॥చం॥**

**4) భక్తియను కట్టుకట్టి చందమామ, పామును యుక్తిచేసి పట్టవలెను చందమామ ॥చం॥**

**5) దేహ దేహములందు చందమామ, పాము తెలియకుండ చుట్టుకొన్నది చందమామ ॥చం॥**

**6) అజప మంత్ర ధ్యానము చేత చందమామ, పాము అఖండ కళలతో వెలుగుచునుండు చందమామ ॥చం॥**

www.thraithashakam.org

**7) పామును బట్టే యోగి ఎవరు చందమామ, ఓహో అతని పేరు సిద్ధగురుడు చందమామ ॥చం॥**

**వివరము :-** ఈ తత్త్వము నేటికినీ అక్కడక్కడ పల్లెజనము పాడుచునే ఉన్నారు. దీనిని వారందరికీ అర్థమగులాగున వివరించుకొందాము. ఈ తత్త్వములో మొదటి వాక్యములోనే 'సంధి తెలిపే జ్ఞానులెవరే' అని వ్రాయబడి ఉన్నది. ఇద్దరి మధ్యన ఉండు దానిని సంధి అంటాము. ఉదాహరణకు పగలు రాత్రికి మధ్యలో ప్రొద్దుక్రుంకు వేళను సంధికాలము అంటున్నారు దానినే **సంధ్యవేళ** అంటున్నాము. రాత్రి పగలును కలుపు కాలమును సంధికాలము అన్నట్లు ఇద్దరు మనుషులను కలుపు వ్యవహారమును సంధి చేయడము అని కూడా అనుచున్నాము. అలాగే జీవున్ని దేవున్ని కలుపుటకు మధ్యలోనున్న జ్ఞానమును సంధి అని అనుచున్నాము. జీవుడు దేవునితో కలుసుటకు ముందు సంధి చేయవలసి ఉన్నది. ఆ సంధియను జ్ఞానమును తెలిపేవారు పూర్తి జ్ఞానవరులై ఉండవలెను. తనకు తెలియని జ్ఞానమును వాక్యము రూపముతో చెప్పుచూ, ఈ జ్ఞాన వివరము తెలిపేవారెవరు అని అడిగినట్లు ఈ తత్త్వములో గలదు. పూర్వము ఒక వ్యక్తి పున్నమి రోజున ఆరు బయట పడుకొని తనకు కల్గిన జ్ఞానసంశయములను గూర్చి చందమామను అడగడమును తత్త్వరూపములో గలదు. చందమామ ఏమి వివరించుతాడో క్రింద చూచెదము.

**1) కాయమను పుట్టలోను చందమామ, పాము మాయగానే మెలగుచుండు చందమామ ॥చం॥**

పాముల నివాసము పుట్టలని చాలామంది అనుకొనుట గలదు. పాము పుట్టలో ఉంటుందనీ, పుట్టకు పూజలు చేయువారిని కూడా

చూస్తూనేయున్నాము. పుట్టలో పాము నివాసము చేయునట్లు, మన శరీరము అను పుట్టలో ఆత్మ అను పాము నివాసము చేయుచున్నది. కావున 'కాయమను పుట్టలోన' అన్నారు. పాముకు బుసకొట్టు స్వభావము ఉన్నట్లు ఆత్మకు కూడా శ్వాస ద్వారా సోహం అను బుసకొట్టు స్వభావము ఉన్నది. మాయం అయిపోయిందని అంటే కనిపించకుండా పోయిందని అర్థము. మాయగా అంటే ఇక్కడ కనిపించకుండా అని అర్థము. శరీరములో ఆత్మ కనిపించకుండా ఉన్నది. కావున 'పాము మాయగానే మెలగుచుండు' అని పై వాక్యములో అన్నారు, శరీరములో ఆత్మ కనిపించకుండా నివాసము చేయుచున్నదను వివరము మొదటి వాక్యములో గలదు.

**2) జంట నాగ స్వరములూది చందమామ, పామును పాదు పెకళింపవలెను చందమామ ॥చం॥**

శరీరములో గల ఆత్మను పాముగ పోల్చుకొన్నపుడు, ఆ పామును పట్టే దానికి కూడా ఉపాయముగలదు. సహజముగా పాములవారు నాగస్వరమును ఊది చుట్టచేసుకొని పాదుగపడుకొన్న పామును లేపి పట్టుకొనుచున్నాడు. అలాగే శరీరములోని పామును పట్టుటకు రెండు ముక్కు రంధ్రములలో ఆడుచున్న శ్వాసను నాగస్వరముగ ఉపయోగించు కోవలసియున్నది. ముక్కు రంధ్రములలో ఆడుచున్న శ్వాసమీద ధ్యాసను పెట్టుకోవడము వలన ఇతర విషయముల మీదికి మనస్సు పోకుండా నిలచిపోవును. అలా మనస్సును శ్వాస ద్వారా ఒక స్థాయికి తెచ్చుకొన్న తర్వాత శూన్యస్థాయికి చేర్చి ఆత్మ మీదికి సులభముగా మళ్లించుటకు వీలుకల్గును. ఈ విధముగా శ్వాస ద్వారా ఆత్మను తెలియవచ్చునన్న ఉద్దేశ్యముతో 'జంట నాగస్వరము ఊది పామును పాదు పెకళించవలెను' అని అన్నారు.

**3) తొమ్మిది వాకిళ్లు మూసి చందమామ, పామును నెమ్మదిగ పట్టవలెను చందమామ ॥చం॥**

శరీరమునకు కళ్ళు రెండు రంధ్రములు, చెవులు రెండురంధ్రములు, ముక్కు రెండురంధ్రములు, నోరు ఒక రంధ్రము, అలాగే క్రింద గుదము, గుహ్యాము అను రెండు రంధ్రములు మొత్తము కలిపి తొమ్మిది రంధ్రములు గలవు. అందువలననే శరీరమును తొమ్మిది రంధ్రములుగల పుట్ట అని అన్నారు. తొమ్మిది రంధ్రముల విషయములను మనస్సు యొక్క ఆలోచనకు తెచ్చుకోకపోతే లోపలయున్న ఆత్మమీద మనోధ్యాస ఏర్పడును. దానివలన ఆత్మ తెలియును. కావున 'తొమ్మిది వాకిళ్ళు మూసి పామును నెమ్మదిగ పట్టవలెనన్నారు.' ఒక్కమారుగా మనస్సు ఆత్మ మీదికి పోదు. అందువలన కొంత సాధన ద్వారా అది సాధ్యపడును. కావున 'పామును నెమ్మదిగ పట్టవలెను' అన్నారు. సాధన ద్వారా బయటి విషయముల మీదికి మనస్సును పోనీయక లోపలనున్న ఆత్మ మీద నిలుపడమును చెప్పుచూ 'తొమ్మిది వాకిళ్ళు మూసి చందమామ పామును నెమ్మదిగ పట్టవలెను చందమామ' అని మూడవ చరణములో అన్నారు.

**4) భక్తియను కట్టుకట్టి చందమామ, పామును యుక్తిచేసి పట్టవలెను చందమామ ॥చం॥**

శరీరములోని ఆత్మను దర్శించుకోవాలంటే మనిషికి భక్తియనునది ముఖ్యము. భక్తికి ఆత్మవశమై పోతుంది కావున భక్తికలవారికి ఆత్మ యందైక్యము లభించును. బయట పాములవాడు మంత్రము చేత కట్టుకట్టి పామును కదలకుండ చేసి పట్టుకొనుచున్నాడు. అదే విధముగా లోపలగల ఆత్మయను పామును భక్తియను మంత్రముచేత **యోగము** అను యుక్తిచేత పట్టవలెనని నాల్గవచరణములో చెప్పారు.

**5) దేహ దేహములందు చందమామ, పాము తెలియకుండ చుట్టుకొన్నది చందమామ ॥చం॥**

అన్ని శరీరములలో ఆత్మ తెలియకుండా నివాసము చేయుచున్నది. కావున 'దేహదేహములందు పాము తెలియకుండ చుట్టుకొన్నది' అని ఐదవ చరణములో అన్నారు.

**6) అజప మంత్ర ధ్యానము చేత చందమామ, పాము అఖండ కళలతో వెలుగుచునుండు చందమామ ॥చం॥**

మన శరీరములో ఆడుచున్న శ్వాసయందు ఒక శబ్దము కలదు. శ్వాస ముక్కురంధ్రముల ద్వారా లోపలికి పోవునపుడు "సో" అను శబ్దముతో పోవుచున్నది. బయటికి వచ్చునపుడు "హమ్" అను శబ్దముతో వచ్చు చున్నది. శ్వాస ఒకమారు లోపలికి పోయి బయటికి రావడములో "సోహమ్" అను శబ్దము ఏర్పడుచున్నది. ఈ సోహమ్ శబ్దములో **"ఓం"** శబ్దము ఇమిడి ఉన్నది. అదేవిధముగా అనగా లోపలికి పోవునపుడు 'సో' అను శబ్దముతో పోవుచున్నది కదా! 'సో' అను శబ్దములో చివరిగ 'ఓ' అను శబ్దము వచ్చుచున్నది. అట్లే శ్వాస లోపలినుండి బయటికి వచ్చునపుడు 'హమ్' అను శబ్దముతో వచ్చుచున్నది కదా! 'హమ్' అను శబ్దములో చివరిగ 'మ్' అను శబ్దము వచ్చుచున్నది. శ్వాస లోపలికి పోవునపుడు చివరిగా వచ్చు 'ఓ' అను శబ్దమును, శ్వాస బయటికి వచ్చునపుడు చివరిగా వచ్చు 'మ్' శబ్దమును కలిపితే **'ఓమ్'** అగుచున్నది. ఒక్కమారు శ్వాస లోపలికి పోయి బయటికివస్తే అందులో 'ఓమ్' కారము ఇమిడియున్నది. శ్వాస ప్రతినిత్యము ఎల్లవేళల ఆడుచున్నది కావున 'ఓమ్' శబ్దము ఎల్లవేళలా మనయందు జపించబడుచున్నది. మనము ప్రయత్న పూర్వకముగ

జపించకనే తానంతటికదే జపించబడుచున్నది కావున ఓంకారమును 'అజప మంత్రము'త అన్నారు. ముక్కు రంధ్రములలో జపించబడుచున్న 'ఓమ్' శబ్దము ఎల్లపుడు అఖండముగా సాగుచున్నది కావున ఆ మంత్రమును స్వయముగ ఆత్మ ధ్యానించుచున్నదనీ, ఆ ధ్యానములో అఖండముగా అందరిలో నిలిచియున్నదనీ ఆరవ చరణములో అన్నారు.

**7) పామును బట్టే యోగి ఎవరు చందమామ, ఓహో అతని పేరు సిద్ధగురుడు చందమామ ॥చం॥**

అటువంటి పామును అనగ ఆత్మను పొందగలిగినవాడు యోగియై సిద్ధి పొందగలడని తెలుపుచు 'పామును పట్టేయోగి సిద్ధగురుడు' అన్నారు.

## 4. తత్త్వము

ఊదేతిత్తుల పైగానుండే ఉన్నతి తెలియర ఓరన్నా
తిత్తుల నడుమను చక్షుల మీదను చీకటి కొట్టుర ఓరన్నా

**1) చీకటి కొట్టును తోక నాలుక తీసుక లేపర ఓరన్నా**
**తీసుక లేపిన కాకకు పాము చిఱ్ఱున లేచుర ఓరన్నా ॥ఊ॥**

**2) శంఖుచక్రముల నట్టనడుమ ఆది శేషుని లేపర ఓరన్నా - ఓంకారించుక ఉన్నది పాము కొరకక లేచుర ఓరన్నా ॥ఊ॥**

**3) ఆరుచక్రముల కావల ఈవల లోపల వెలుపల ఓరన్నా - ఆరుచక్రముల పెనుచుక పాము అధోముఖంబై ఓరన్నా ॥ఊ॥**

**వివరము :-** శరీరములో కుడి ఎడమగా రెండు ఊపిరితిత్తులున్నాయని

www.thraithashakam.org

అందరికీ తెలుసు. రెండు తిత్తులనుండి వచ్చే ఊపిరి ముక్కు ద్వారా బయటికి వస్తున్న విషయము కూడా అందరికీ తెలుసు. ఊపిరితిత్తులు కదలుతుంటేనే శ్వాస ఆడుచున్నదని కూడా అందరికీ తెలియును. ఊపిరి తిత్తులు ఎలా కదులుచున్నవి, వాటిని ఎవరు కదలించుచున్నారన్న విషయము ఎవరికీ తెలియదు. ఊపిరితిత్తులను కదలించుశక్తి ఏదని తెలుసుకోవడమునే పై తత్త్వములో 'ఊదేతిత్తుల ఉన్నతి తెలియర ఓరన్నా' అన్నారు. మన శరీరములో రెండు ఊదేతిత్తుల (ఊపిరితిత్తుల) మధ్యలోను మరియు పైన రెండు కన్నుల మధ్యలోను క్రింద గుదస్థానము మొదలుకొని పై శిరస్సు వరకు వెన్నుపూసల మధ్యలో వెన్నుపాము అనబడు నరముగలదు. పై తత్త్వములో పాము అన్నట్లు వెన్నుపాము పేరుకు పామువలె పొడవుగ ఆకారమున్నప్పటికీ అది మెదడు నుంచి క్రింది వరకు వ్యాపించిన ఒక పెద్ద నరము. శరీరములో అతిపెద్ద నరము వెన్నుపాము ఒక్కటే. ఈ నరములోనే మనిషిలోని చైతన్యశక్తి ఇమిడియున్నది దానిని కుండలీశక్తియనీ కొందరనుచున్నారు. వాస్తవానికి అది మన శరీరములోని ఆత్మశక్తియే. ఆత్మ అంటే ఏమిటి? దాని శక్తి అంటే ఏమిటి? అని కళ్ళుమూసుకొని కళ్ళమధ్య స్థానములోనికి చూచితే అంతా చీకటిమయముగా కనిపించును. ఆ విషయమునే పై తత్త్వములో 'తిత్తుల నడుమను చక్షుల మీదను చీకటికొట్టుర ఓరన్నా' అని అన్నారు.

**1) చీకటి కొట్టును తోక నాలుక తీసుక లేపర ఓరన్నా - తీసుక లేపిన కాకకు పాము చిట్టున లేచుర ఓరన్నా ॥ఊ॥**

చీకటిమయముగా ఉన్న ఆత్మను పాముగ కూడా ఒక తత్త్వములో చెప్పుకొన్నాము. మన ధ్యాసనంతటిని కన్నుల మధ్యలో భ్రూ మధ్యమున

కేంద్రీకరించిన అది యోగమగును. యోగము యొక్క తీవ్రతకు ఆత్మ తెలియుటకు మొదలిడును. ధ్యాసనంతటినీ భ్రూమధ్యన కేంద్రీ కరించడమును 'తోక నాలుక తీసుక' అన్నారు. తోక చివరిది నాలుక అనగ మొదటిది చిన్న ఆలోచనను, పెద్ద ఆలోచను అన్నిటినీ లేకుండా చేసకోవడమును, లేక చివరి ఆలోచనను మొదటి ఆలోచనను లేకుండా చేసుకోవడమును తోక నాలుక అనడమైనది. అన్ని ఆలోచనలను లేకుండా చేసుకుంటే ఆత్మ తొందరగా తెలియును. పాము భూమి మీద పడుకొని యున్నపుడు కనిపించకుండా ఉండును. పైకిలేచి పడగెత్తితే అంతకు ముందు కనిపించని పాము కనిపించును. ఆలోచనలు అణచినపుడు యోగమునకు ఆత్మ పైకిలేచిన పాము తెలిసినట్లు తెలియగలదని మొదటిచరణములో చెప్పారు.

**2) శంఖుచక్రముల నట్టనడుమ ఆది శేషుని లేపర ఓరన్నా - ఓంకారించుక ఉన్నది పాము కొరకక లేచుర ఓరన్నా ॥ఊ॥**

శరీరములో వెన్నుపాము అను నరమునకు కుడి ఎడమగ రెండు నరములు గలవు. వెన్నుపామును బ్రహ్మనాడి అని అనుచూ కుడి ఎడమగవున్న రెండు నాడులను సూర్యచంద్రనాడులు అంటున్నారు. సూర్యచంద్రనాడుల నడుమయున్న వెన్నుపామును ఆదిశేషుడని పై తత్త్వములో అన్నారు. సూర్యచంద్రనాడులను శంఖుచక్రములని కూడా అన్నారు. వెన్నుపాములోని ఆత్మశక్తి ఊపిరితిత్తులను కదలించుట వలన శ్వాస నడుచుచున్నది. శ్వాస నడుపునపుడు ఓంకార శబ్దము ఏర్పడు చున్నది. ఈ విషయమునే రెండవ చరణములో తెలుపుచూ 'శంఖు చక్రముల నడుమను ఆదిశేషుని లేపర ఓరన్నా – ఓంకారించుకయున్నది పాము' అని అన్నారు.

www.thraithashakam.org

**3) ఆరుచక్రముల కావల ఈవల లోపల వెలుపల ఓరన్నా - ఆరుచక్రముల పెనుచుక పాము అదోముఖంబై ఓరన్నా ॥ఊ॥**

వెన్నుపాములో మొత్తము ఏడు నాడీకేంద్రములున్నవి. పైన ఏడవ నాడీకేంద్రములో ఆత్మ కేంద్రముగ ఉండి, క్రింది ఆరు కేంద్రముల వరకు వ్యాపించియున్నది. క్రింద ఆరు కేంద్రములనుండి శరీరమంతా నరముల ద్వారా ప్రాకి శరీరమును చైతన్యవంతము చేసి కదలించుచున్నది. బ్రహ్మనాడి లోని ఆత్మ ఆరు కేంద్రములనుండి శరీరమంతా వ్యాపించి ఉన్నది. ఈ విషయమును తెలియజేస్తూ 'ఆరుచక్రముల ఆవల ఈవల లోపల వెలుపల' అన్నారు. పైన ఏడవకేంద్రము నుండి క్రింది కేంద్రములకు వ్యాపించి యున్నది కావున 'ఆరుచక్రముల పెనుచుక పాము అధోముఖంబై ఓరన్నా' అని మూడవ చరణములో అన్నారు. ఈ తత్త్వములో ఆత్మ వెన్నుపాములో పై నుండి క్రిందికి వ్యాపించి ఆరు కేంద్రముల ద్వారా శరీరమంతటినీ కదలించు చున్నదనీ, శరీరములోని ఊపిరితిత్తుల ద్వారా శ్వాసను ఏర్పరచినదనీ తెలియుచున్నది. శరీరములో తెలియక కనబడకయున్న ఆత్మను మనోధ్యాస ద్వారా తెలుసుకోవచ్చునని కూడా పై తత్త్వములో తెలిపారు. కొలిమితిత్తుల వలె శరీరములోని ఊపిరితిత్తులు గలవు కావున వాటిని ఊదేతిత్తులు అన్నారు. ఊదేతిత్తుల ద్వారా శ్వాసను ఎల్లప్పుడు ఊదువాడు వెన్నుపాము లోని ఆత్మని తెలియబడినది.

## 5. తత్త్వము

**ఈ జన్మమిక దుర్లభమురా ఓరీ సాజన్మ సాకార సద్గురుని కనరా ॥ఈ జన్మ॥**

**1. పంచాక్షరి మంత్రము పఠన చేయరన్న**
**పఠన చేసిన యముడు పారిపోవునన్నా,**
**పారిపోతే అంబఫలమిచ్చునన్న**
**ఫలమునందిన వాడు పరమగురుడన్నా ॥ఈ జన్మ॥**

**2. మూడారు వాకిళ్లు మూయవలెనన్న**
**ముక్తివాకిట నిలచి తలుపు తీయన్నా**
**తలుపు తీసిన అంబతేజమిచ్చన్న**
**తేజమందినవాడు తాగురుడోయన్నా ॥ఈ జన్మ॥**

**3. ఆరునదుల మీద అంబయున్నదన్న**
**అంబతో దుర్గాంబ ఆటలాడునన్నా**
**ఆట్లాటలో మంచి అర్థమున్నాదన్న**
**అర్థమెరిగినవాడు తాహరిగురుడన్నా ॥ఈ జన్మ॥**

**4. నాసికముపై దృష్టి నడిపించుమన్న**
**నడిపించి హరిని నీవు నమ్మియుండన్నా**
**నమ్మి నవరత్నముల పీఠమెక్కన్న**
**పీఠమెక్కిన అంబ పిలుచునోయన్నా ॥ఈ జన్మ॥**

**5. జంట త్రోవల రెండినంటి ఊదన్న**
**అంటి యూది మేన్మరచి యట్టే నిలువన్నా**
**మేను మరచి ఘంటానాదము వినుమన్న**
**నాదమువిని పోతులూరిని నమ్మియుండన్నా ॥ఈ జన్మ॥**

**వివరము :-** భూమి మీద ఎన్నో జీవరాసులు గలవు. వాటి అన్నిటిలో తెలివైనది మానవ జన్మ. ప్రపంచ జ్ఞానములో తెలివైనదైనప్పటికీ పరమాత్మ

www.thraithashakam.org

జ్ఞానములో తెలియనిదే. అందువలన తెలివైన మానవజన్మలోనే తెలియని దైవజ్ఞానము తెలుసుకోవాలి. ఎంత తెలివియున్నవాడైనప్పటికీ పరమాత్మ జ్ఞానము తెలియాలంటే తప్పనిసరిగా గురువు అవసరము. చాలా సూక్ష్మమైన జ్ఞాన విషయములు వివరించి చెప్పుటకు సద్గురును వెదకి ఆయనవద్ద జ్ఞానము తెలుసుకోవాలి. కావున పై తత్త్వములో 'ఈ జన్మమిక దుర్లభమురా ఓరీ సాజన్మ సాకార సద్గురుని కనరా' అన్నారు.

**1. పంచాక్షరి మంత్రము పఠన చేయరన్న**
**పఠన చేసిన యముడు పారిపోవునన్నా,**
**పారిపోతే అంబఫలమిచ్చునన్న**
**ఫలమునందిన వాడు పరమగురుడన్నా ॥ఈ జన్మ॥**

పంచాక్షరి అంటే ఐదు అక్షరములతో కూడుకొన్న మంత్రమని అందరు అనుకొంటారు. అందరూ అనుకొను మంత్రము "ఓం నమః శివాయ". ఈ మంత్రములో ఐదు అక్షరములుకాక ఆరు అక్షరములు గలవు. కావున ఈ మంత్రము యొక్క అసలైన వివరమును తెలుసుకొందాము. 'అక్షరము' అనగ 'నాశనము కానిదని' అర్థము. 'క్షరము' అనగ 'నాశనము' అని అర్థము. ఐదు అనగా ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను పంచభూతములని తెలుసుకోవలెను. జ్ఞానము ప్రకారము ఐదు పంచ భూతములకు సర్వజీవరాసులు నశించిపోవుచున్నవి. పంచభూతముల వలన జీవులు పుట్టుచున్నవి, అలాగే జీవరాసులన్నీ పంచభూతములలోనే లయమైపోవుచున్నవి. పంచభూతములకు నాశనముకానిది ప్రపంచములో ఒక్కటే గలదు అదియే దేవుడు. దేవున్ని 'ఓం' అని ఒక గుర్తుగా మన పెద్దలు పెట్టారు. మిగతా పంచ భూతములకు కూడా అలాంటి గుర్తులనే ఉంచారు. ఆకాశమునకు **'న'** అనియు, గాలికి **'మః'** అనియు, అగ్నికి **'శి'**

అనియు, నీరుకు **'వా'** అనియు, భూమికి **'య'** అనియు గుర్తులు కల్పించారు. పంచభూతములకు కల్పించిన ఐదు గుర్తులను బీజాక్షరములన్నారు. పంచభూతములకు బీజాక్షరములు వరుసగ **'నమః శివాయ'** అని ఉండగా పంచభూతములకు నాశనముకాని దేవునికి 'ఓం' అను బీజాక్షరము గలదు. దేవుడు పంచభూతములకు నశించడు కావున పంచఅక్షరి అని ఓం ను అన్నారు. పంచాక్షరి అనగ ఐదుకు నాశనము కానిదని అర్థము. పంచాక్షరి మంత్రములో ఐదు భూతములైన ప్రకృతి, వాటికి నాశనముకాని పరమాత్మను కలిపి చెప్పారు. దానినే **"ఓం నమః శివాయ"** అన్నారు. పంచాక్షరి మంత్రము యొక్క అర్థము తెలిసి దానినే ధ్యానించుచున్నవాడు ఎరుక కల్గియుండును. ఆ ధ్యానము చేత యోగము ఏర్పడును. యోగము వలన కర్మలు నశించుచూపోవును. కర్మలున్నపుడు కదా యముడు మనలను బాధించేది. బాధపడు కర్మలు యోగముచేత కాలిపోవుట వలన యముడు కూడా ఏమీ చేయలేడు. అందువలన ఈ తత్త్వములో 'పంచాక్షరిమంత్రము పఠనచేయరన్న పఠనచేసిన యముడు పారిపోవునన్నా' అని మొదటి చరణములో చెప్పారు. ఎపుడు కర్మలు లేకుండా పోవునో అపుడు పరమాత్మ మోక్షమను పండును ఇచ్చును. మోక్షము పొందినవాడు పరమగురుడని చెప్పారు. మోక్షమును పండు అని వర్ణించినవారు, పరమాత్మను అంబ అని వర్ణించారు. పరమాత్మ ఇచ్చునదే పరమపదము కావున 'అంబ ఫలమిచ్చునన్నారు.'

**2.** **మూడారు వాకిళ్లు మూయవలెనన్న**
**ముక్తివాకిట నిలచి తలుపు తీయన్నా**
**తలుపు తీసిన అంబతేజమిచ్చన్న**
**తేజమందినవాడు తాగురుడోయన్నా ॥ఈ జన్మ॥**

మన శరీరమునకు మొత్తము తొమ్మిది రంధ్రములు గలవు. వాటినే తొమ్మిది వాకిళ్ళు అన్నారు. శరీరము మీద ధ్యాసలేకుండ చేయడమును తొమ్మిది వాకిళ్ళు మూసివేసినట్లన్నారు. అజ్ఞానమునుండి జ్ఞానములో ప్రవేశించుటకు కనిపించని ఒక వాకిలి గలదు. దానినే ముక్తివాకిలి అన్నారు. ఒక మనిషి తన శరీరము మీద ధ్యాసలేకుండా చేసుకొని తన జ్ఞానము ద్వార యోగములోనికి ప్రవేశించడమును పై తత్త్వములో 'మూడారు (మూడు ఆరు మొత్తము తొమ్మిది) వాకిళ్ళు మూయవలెనన్న ముక్తివాకిట నిలిచి తలుపుతీయన్నా' అని అన్నారు. ఆ విధముగా శరీరము మీదకూడా ధ్యాసలేకుండ జ్ఞానము ద్వారా ముక్తివాకిలి తెరచి బ్రహ్మయోగములోనికి పోయిన వానికి ఆత్మ తెలియును. ఆత్మ తెలియడము ద్వారా జ్ఞానశక్తి లభించును. ఆత్మ ద్వారా ఆ జ్ఞానాగ్నిని కల్గినవాడు తనకున్న కర్మలను కట్టెలను పూర్తిగా కాల్చివేసుకొని మోక్షము పొందును. అందువలన 'తలుపుతీసిన అంబ తేజమిచ్చున్న, తేజమందినవాడు తాగురుడోయన్నా' అని రెండవ చరణములో రెండవ వాక్యమునందు చెప్పారు. మూడారు వాకిళ్ళు శరీరములోని తొమ్మిది రంధ్రములనీ, తలుపు తీయడమంటే యోగము పొందడమనీ, అంబ తేజమును జ్ఞానాగ్ని వెలుగనీ, అంబ అనగ ఆత్మనీ, కర్మ కాలిపోయి మోక్షము పొందినవానిని గురుడనీ పై చరణములో తెలిపారు.

**3. ఆరునదుల మీద అంబయున్నదన్న**
**అంబతో దుర్గాంబ ఆటలాడునన్నా**
**ఆట్లాటలో మంచి అర్థమున్నాదన్న**
**అర్థమెరిగినవాడు తాహరిగురుడన్నా ॥ఈ జన్మ॥**

మన శరీరములో అతిపెద్దనాడి బ్రహ్మనాడి. దానినే సుషుమ్ననాడి అని కూడా అంటుంటారు. ఈ నాడిలో మొత్తము ఏడు కేంద్రములు గలవు. ఆరు కేంద్రములకు పైన ఏడవ కేంద్రములో ఆత్మ నివాసము చేయుచున్నది. అందువలన మూడవ చరణములో క్రింది ఆరు నాడీ కేంద్రములను ఆరు నదులుగా పోల్చి, పైన ఏడవ కేంద్రములోనున్న ఆత్మను అంబ అని, ఆరు నదుల మీద అంబ ఉందన్నారు. ఆత్మ పరమాత్మ స్వరూపమైన 'ఓం' అను పంచాక్షరితో శ్వాసను నడుపుచున్నది కావున శ్వాసనడుచుటను ఆట అని, శ్వాసలో ఇమిడియున్న 'ఓం'ను మంచి అర్థమని, ఓంకారమును తెలిసినవాడు ఆటలోని అర్థము తెలిసినవాడని, పరమాత్మలోనికి ఐక్యమైనవానిని హరిగురుడని కూడా ఈ చరణములో చెప్పారు.

**4. నాసికముపై దృష్టి నడిపించుమన్న**
**నడిపించి హరిని నీవు నమ్మియుండన్నా**
**నమ్మి నవరత్నముల పీఠమెక్కన్న**
**పీఠమెక్కిన అంబ పిలుచునోయన్నా ॥ఈ జన్మ॥**

నాశికము అనగ ముక్కు. ఈ తత్త్వములో నాశికముపై అన్నారు. నాశికాగ్రము (నాశికముపై) అంటే ఏమిటో తెలియక చాలామంది సాధకులు తికమకపడుచున్నారు. పై భాగమును అగ్రభాగము అని అంటాము. ముక్కు పై భాగమును నాశికాగ్రము అని ఆధ్యాత్మిక విద్యలో చాలాచోట్ల చెప్పారు. నాశికాగ్రముపై దృష్టి నిలుపమని పెద్దలు చెప్పితే అది అర్థముకాక, తమ మనోధ్యాసను ముక్కు పై భాగమునగల ఏడవ కేంద్రములో నిలుపవలెనని తెలియక, బయటి దృష్టిని ముక్కు క్రిందికొన భాగములో నిలిపి చూచువారు కొందరు గలరు. మరికొందరు ముక్కు పై భాగమైన కనుబొమ్మల మధ్య భాగములో చూపును నిలిపి చూచువారు గలరు. పై చూపుతో చూచు ఈ

www.thraithashakam.org

రెండు విధానములు తప్పని, చూపు అనగ మనోదృష్ఠి అయిన ధ్యాస అని, నాశికాగ్రము అనగా లోపల గల ఏడవ నాడీకేంద్రమని తెలియదు. ఏడవ నాడీ కేంద్రములో ఆత్మ నివాసమున్నది. ఏడవ కేంద్రములో మనోదృష్ఠిని నిలుపగా కొంతకాలమునకు ఆత్మ తెలియును, ఆత్మను తెలిసిన తర్వాత పరమాత్మను పొందవచ్చును. ఈ విషయమును తెలియజేయుచూ పై తత్త్వములోని నాల్గవ చరణములో 'నాశికముపై దృష్ఠి నిలుపన్నా' అన్నారు. ఆత్మ నివాసమును నవరత్న పీఠముగ వర్ణిస్తూ, సప్తస్థానము చేరినవానిని పీఠమెక్కినవాడనీ అన్నారు. అంబ అనగ ఆత్మయని, ఆత్మ ద్వార పరమాత్మను చేరడమును 'అంబపిలుపని' ఈ చరణములో చెప్పారు. ఈ విధముగ ఏడవ కేంద్రములో మనస్సును నిలిపి, బ్రహ్మయోగము పొందడమును గురించి చెప్పారు.

**5. జంట త్రోవల రెండినంటి ఊదన్న**
**అంటి యూది మేన్మరచి యట్టే నిలువన్నా**
**మేను మరచి ఘంటానాదము వినుమన్న**
**నాదమువిని పోతులూరిని నమ్మియుండన్నా ॥ఈ జన్మ॥**

శరీరములోని పెద్దనాడి అయిన బ్రహ్మనాడినుండి వచ్చు ఆత్మ చైతన్యము ఊపిరితిత్తులకు చేరి, వాటిని కదలించి శ్వాస ఆడునట్లు చేయుచున్నది. శ్వాస రెండు ముక్కు రంధ్రముల ద్వారా ఆడుచున్నది. రెండు ముక్కు రంధ్రములలో ఆడుచున్న శ్వాసను ప్రయత్నము చేసి 'కుంభకము' అను సాధన ద్వారా నిలబెట్టగలిగినపుడు శరీరములో అన్ని కదలికలు నిలిచిపోవును. శరీరమునంతటినీ మరచి మనస్సు ఒకే ధ్యాసలో నిలిచిపోవును. అపుడు శరీరములోని ఆత్మ తెలియును. ఘంటానాదము ఏకస్థాయి శబ్దము కల్గియున్నట్లు ఒకే స్థాయిలో ఆత్మను తెలియువాడు

www.thraithashakam.org

నిజయోగి అగును. ఈ విషయమును చెప్పుచూ రెండు ముక్కు రంధ్రములలో శ్వాసను లోపలికి పీల్చి నిలుపడమును 'జంట త్రోవల రెంటినంటి ఊదన్నా' అన్నారు. శరీరము మీద ధ్యాసలేకుండా మనస్సు నిలచి పోవడమును 'మేనుమరచి అట్టే నిలువన్నా' అన్నారు. ప్రపంచ విషయములను వదలి నిలచిపోయిన మనస్సు ఆత్మను తెలియగల్గుచున్నది. కావున 'ఘంటా నాదము వినుమన్నా' అన్నారు. ఇట్లు శ్వాస ద్వారా బ్రహ్మయోగమును పొంది ఆత్మను తెలియు విధానమును ఈ తత్త్వములో వర్ణించి చెప్పారు.

## 6. తత్త్వము

చిల్లర రాళ్ళకు మ్రొక్కుచువుంటే చిత్తము చెడునుర ఒరేయొరే
చిత్తమునందు చిన్మయ జ్యోతిని చూచుచు నుండుట సరే సరే ॥చి॥

**1. ఒక్క ప్రొద్దులని ఎంచుచుయుంటే ఒనరుగ చెడుదువు ఒరేయొరే**
**ఏకమైన ఆ వైభవమూర్తిని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

**2. నీళ్ళలో మునిగి గొనుగుచుయుంటే నిలకడ చెడునుర ఒరే యొరే**
**నీలోయుండే నిర్మల జ్యోతిని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

**3. బాధ గురువుల పంచను జేరితే భావము చెడునుర ఒరే యొరే**
**భావమందున బ్రహ్మకాంతిని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

**4. భూములు అడవులు తిరుగుచునుంటే బుద్ధులు చెడునుర ఒరేయొరే**
**బుద్ధిలోయుంటే పున్నమిచంద్రుని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

**5. వీరయ్య చెప్పిన వాక్కును నమ్మితె వివరము తెలియును ఒరేయొరే**
**వివరమందుండె విగ్రహమూర్తిని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

**వివరము :–** 5160 సంవత్సరముల పూర్వము చెప్పిన ఇందూమత గ్రంథమైన

www.thraithashakam.org

భగవద్గీతలోనూ, 2017 సంవత్సరముల పూర్వము చెప్పిన క్రైస్థవ మతగ్రంథమైన బైబిలులోనూ మరియు దాదాపు 1420 సంవత్సరముల పూర్వము చెప్పిన ఇస్లామ్ మతగ్రంథమైన ఖురాన్‌లోను 'ఏకేశ్వరోపాసన' చెప్పబడినది. అందరికంటే మించిన దేవుడొకడున్నాడని, అతనినే ఆరాధించవలెననీ మత గ్రంథములన్నియూ ఘోషిస్తున్నవి. అయినప్పటికీ మానవులు అందరికంటే గొప్పవాడైన పరమాత్మను ఆరాధించక అన్య దేవతారాధనలలో మునిగిపోయారు. అసలైన దేవున్ని మరచి చిల్లర దేవుళ్ళను మ్రొక్కను మొదలు పెట్టారు. అందరిలోను, అన్ని స్థలములలోను ఎల్లవేళలా అంతటా వ్యాపించివున్న పరమాత్మ జ్ఞానము తెలియక మిగతా చిల్లర దేవుళ్ళను గొప్పగా పెట్టుకొన్నారు. ఒక్కొక్క దేవునికి ఒక్కొక్క నియమము ప్రకారము పూజలు చేయుచున్నారు. తనలోనే ఉన్న పరమాత్మను గుర్తించలేక కొందరు తీర్థయాత్రలు, కొందరు వ్రతక్రతువులు, కొందరు యజ్ఞ యాగాదులను చేయుచున్నారు. చివరకు ఇవన్నీ వృథా ప్రయాసలని తెలుసుకొన్నవారు దేవుని జ్ఞానమును పొందుచున్నారు. ఈ విధముగా అసలైన దేవుని జ్ఞానము తెలిసిన పెద్దలు జ్ఞానము తెలియనివారిని గూర్చి తత్త్వరూపములో చెప్పిన దానిని క్రింద వివరించుకొందాము.

**చిల్లర రాళ్ళకు మ్రొక్కుచువుంటే చిత్తము చెడునుర ఒరేయొరే**
**చిత్తమునందు చిన్మయ జ్యోతిని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

సర్వసృష్ఠికి మూలకర్త అయిన పరమాత్మ విశ్వమంతా వ్యాపించి అణువణువునా నిండియున్నాడు. మానవజన్మ యొక్క అంతరార్థము పరమాత్మను తెలుసుకోవడమే అయినప్పటికీ ఆ దేవున్ని తెలుసుకొను జ్ఞానము తెలియకుండాపోయినది. జ్ఞానము తెలియక మాయలో మునిగియున్న మానవులు తమలోని భక్తిని దేవుడైన పరమాత్మ మీదకాక

మాయయైన చిల్లర దేవుళ్ళ మీద చూపుచున్నారు. దేవుడు కానటువంటి మాయయైన చిల్లర దేవుళ్ళను మ్రొక్కడము వలన మనిషిలోని చిత్తము అనేక భ్రమలలో మునిగిపోవుచున్నది. అనేక దేవుళ్ళలో ఏ ఒక్క దేవుని మీదనుకాక అనేక దేవుళ్ళను పండుగలను బట్టి, కోర్కెలను బట్టి పూజించుట వలన చిత్తములో ఏమాత్రము శాంతి ఏర్పడక మనిషి అశాంతితో మునిగి పోవుచున్నాడు. కావున జ్ఞానము తెలిసిన పెద్దలు పై తత్త్వములో 'చిల్లర రాళ్ళకు మ్రొక్కుచుయుంటే చిత్తము చెడునుర' అన్నారు. దైవజ్ఞానము తెలిసినవారు చిల్లర దేవుళ్ళ వ్యామోహములో పడక, కనపడిన ప్రతి బొమ్మకు మ్రొక్కక, శరీరములోనే దేవుడున్నాడనీ, మిగతావారు అసలైన దేవుడు కాలేరనీ, శరీరములోనే దేవున్ని తెలుసుకొనుటకు ప్రయత్నించుచుందురు. అటువంటి వారు 'చిత్తములోని చిన్మయజ్యోతిని చూచుకోవడమే మంచిదని' తెలిపారు.

**1. ఒక్కప్రొద్దులని ఎంచుచుయుంటే ఒనరుగ చెడుదువు ఒరేయొరే**
**ఏకమైన ఆ వైభవమూర్తిని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

శరీరములోని పరమాత్మను తెలుసుకొను జ్ఞానములేనివారు శరీరము నకు బయటగల ప్రతిమలను అనేక దేవుళ్ళ పేరుతో ఆరాధించుచుందురను కొన్నాము కదా! అటువంటి ఆరాధనలలో ఉపవాసములు (ఒక్కప్రొద్దు) ఉండుట కూడా కొందరు చేయుచుందురు. ఉపవాసముల వలన ఆరోగ్యమే చెడునుకానీ శరీరములోని దేవుడు తెలియడు. ఉపవాసముల వలన ఆత్మకు శక్తి లేకుండా పోవును. ఆత్మ బలహీనపడును. అందువలన ఆత్మను ఇబ్బంది పెట్టినవారమగుదుము. ఇదే విషయమునే భగవద్గీతలో శ్రద్ధాత్రయ యోగమను అధ్యాయములో 4, 5, 6 వ శ్లోకములలో **"ఇతర దేవతల పూజచేయు వారు, అశాస్త్రీయ పద్ధతులను ఆచరించుచూ, వారు బాధపడునది కాక వారిలోపలనుండు నన్ను కూడా బాధింతురని"** దేవుడు అన్నట్లు కలదు. కావున ఉపవాసముల వలన తానైన జీవాత్మ బాధపడునదే

www.thraithashakam.org

కాక లోపలయున్న ఆత్మను కూడా బాధించినవారమగుచున్నాము. అందువలన ఉపవాసముల వలన ఏమీ ప్రయోజనము లేదని తెల్పుచూ 'ఒక్క ప్రొద్దులని ఎంచుచువుంటే ఒనరుగ చెడుదువు' అని పై తత్త్వములో చెప్పారు. అంతేకాక అంతటా వ్యాపించివున్న పరమాత్మను తెలియడమే మంచిమార్గమని తెలుపుచు 'ఏకమైన ఆ వైభవమూర్తిని చూచుచు నుండుట సరే సరే' అన్నారు.

**2. నీళ్ళలో మునిగి గొనుగుచుయుంటే నిలకడ చెడునుర ఒరే యొరే**
**నీలోయుండే నిర్మల జ్యోతిని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

కొందరు మంత్రోపదేశములను పొంది ఆ మంత్రములను నియమము ప్రకారము జపించుచుందురు. అటువంటి నియమములలో నీటిలో గొంతువరకు దిగి లేక నడుముల వరకు దిగి జపించవలెనను పద్ధతులుండును. అట్లు జపించుటవలన మంత్రము మీద ధ్యాస పెరుగునని వారి నమ్మకము. ఈ విధముగ నీటిలో దిగి మంత్రజపము చేయుట వలన, నీటిలో మునిగి శివుని జపము చేయుటవలన లేని ఆస్థమ (ఉబ్బస) రోగము వచ్చును కానీ మనసు కుదుటపడదు. ఏమాత్రము జ్ఞానము అభివృద్ధి చెందదు. అట్లు బయటి పూజలకు జపములకు అలవాటుపడుట వలన మన శరీరములో ఉండే నిర్మల జ్యోతియైన పరమాత్మను తెలియలేము. దేవుడు తెలియాలంటే నిజమైన భక్తి అవసరము. ఆ నిజమైన భక్తి మన శరీరములోని దైవము మీద చూపడమే సరియైనది. అట్లుకాక బాహ్యాచరణ వలన, అన్యదేవతల ఆరాధనల వలన ఎవరికీ అంతరంగములోని దేవుడు తెలియడు. అందువలన ఈ తత్త్వములో 'నీళ్ళలో మునిగి గొనుగుచువుంటే నిలకడ చెడునుర' అన్నారు. అంతేకాక 'నీలోయుండే నిర్మల జ్యోతిని చూచుచు నుండుట సరే సరే' అన్నారు.

www.thraithashakam.org

**3. బాధ గురువుల పంచను జేరితే భావము చెడునుర ఒరే యొరే**
**భావమందున బ్రహ్మకాంతిని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

ఇప్పటి కాలములో భూమి మీద రెండు రకముల గురువులు గలరు. ఒక రకము బాధ గురువులు, రెండవ రకము బోధ గురువులు. శరీరమునకు పని కల్పించి దాని ద్వారా దేవున్ని తెలుసుకోవచ్చునని తెల్పెడివారు బాధ గురువులు. శరీరమునకు బాధను కల్పించు వారందరూ బాధ గురువులే. ఉదాహరణకు 'దేవుని ప్రతిమకు ప్రదక్షణలు చేయమని చెప్పెడి గురువులు బాధగురువులే' అగుదురు. అట్లు ప్రదక్షణము చేయడము పని అగుచున్నది దానివలన శరీరమునకు శ్రమ ఏర్పడుచున్నది. ఈ విధముగ శరీరముతో చేయు ఆరాధనలను చెప్పువారు కాని, మంత్రము చెప్పు గురువులుకాని బాధగురువులే అగుదురు. ఈ విషయమునే వేమనయోగి తన పద్యములో...

**కర్మల చెప్పవాడు కడగురుడు**
**మంత్రము చెప్పవాడు మధ్యమ గురుడు**
**ఊరుకుండుమను వాడు ఉత్తమ గురుడు**
**విశ్వదాభిరామ వినరవేమా.**

అన్నాడు. శరీరశ్రమను కల్గించు బోధనలు చేయువారందరూ బాధగురువులని చెప్పడమే ఈ పద్యములోని అంతరార్థము. భక్తిలో పనులు చెప్పువారు తక్కువ గురువని, అలాగే మంత్రము చెప్పి దాని పనిలో ఉండమనువాడు మధ్యమ గురుడని వేమనయోగి అన్నాడు. అట్లే శరీరముతో ఏ పనులు లేకుండా, మనస్సుతో కూడా పనిలేకుండా, ఏ సంకల్పము లేకుండా ఉండమని బోధించువాడు ఉత్తమగురుడని అతనే బోధ గురువని, అట్లు చెప్పకుండా మనస్సుతోకాని, శరీరముతోకాని పని కల్పించు బోధ చేయు వారందరూ బాధ గురువులని చెప్పారు. అందువలన ఈ తత్త్వములో

'బాధ గురువుల పంచను చేరితే భావము చెడునుర' అన్నారు. మనస్సును నిలిపి ఆత్మ దర్శనమును చేసుకోవడము సరియైన పద్ధతని తెలుపుచూ 'భావమందున బ్రహ్మకాంతిని చూచుచు నుండుట సరే సరే' అన్నారు.

**4. భూములు అడవులు తిరుగుచునుంటే బుద్ధులు చెడునుర ఒరేయొరే**
**బుద్ధిలోయుండే పున్నమిచంద్రుని చూచుచు నుండుట సరే సరే ॥చి॥**

ఎంతోమంది దైవభక్తి కల్గినవారు గలరు. వారికి దైవభక్తి ఉంది కానీ దేవుడెవరని తెలియదు. అట్లు తెలియక పోవడము వలన తీర్థయాత్రలను పేరుతో ఎందరో దేవుళ్ళను దర్శించుచుందురు. ఎన్నో పుణ్యక్షేత్రములను చూచుచుందురు. ఈ విధముగ చేసినప్పటికీ అసలైన జ్ఞానము తెలియదు, అసలైన దేవుడు తెలియబడడు. తీర్థయాత్రలచే పుణ్యక్షేత్రములను దర్శించుట వలన పుణ్యమొచ్చునేమోకానీ జ్ఞానము మాత్రము రాదు. అవి కేవలము పుణ్యక్షేత్రములు మాత్రమే, కాని జ్ఞాన క్షేత్రములు కాదుకదా! భూమి మీద కొన్ని క్షేత్రములను దర్శించి దైవదర్శనము చేసుకొన్నామనుకొనుట శుద్ధ పొరపాటు. నిజదైవము కొన్ని పుణ్యక్షేత్రముల లోనే కాక భూగోళమంతయూ నిండియున్నాడు. దేవుడు బాహ్యముగ తెలియువాడు కాడు, కనుక శరీరమను క్షేత్రములోపలే దర్శించుకోవలసి యున్నది. ఆ విషయము మనకు తెలియుటకు ఈ తత్త్వములో 'భూములు అడవులు తిరుగుచువుంటే బుద్ధులు చెడునుర ఒరే ఒరే' అన్నారు. శరీరములోనే దైవము తెలియునని చెప్పుటకు 'బుద్ధిలోవుండే పున్నమి చంద్రుని చూచుచు నుండుట సరే సరే' అన్నారు. ఈ తత్త్వమును చూచిన తరువాతయైనా మనము బాహ్యముగనున్న భక్తిని వదలి అంతరంగములో భక్తిని కల్గి లోపలేయున్న దేవున్ని తెలియవలెనని తెలుపుచున్నాము.

# 7. తత్త్వము

నేజూచినానే బ్రహ్మమునాలో నేజూచినానే సద్గురునాలో నేజూచినానే
నేజూచినానే తలలో తారకయోగమందు రంజిల్లు నాగురుని నేజూచినానే

1. **కన్నుల నడుమను సన్నపు దిడ్డిన తిన్నగా వెలిగేటి పున్నమి చంద్రుని నేజూచినానే** **॥నేజూ॥**

2. **పాలభాగమందు నీలజ్యోతుల నడుమ నోలలాడుచున్న పరలింగ మూర్తిని నేజూచినానే** **॥నేజూ॥**

3. **చూపులోపల పాపల నడుమను వ్యాపించి వెలిగేటి ఆ పరంజ్యోతిని నేజూచినానే** **॥నేజూ॥**

4. **చక్షురాగ్రమునందు పశ్చిమవీధిని నిక్షేపమై వెలుగు సాక్షిభూతుని నేజూచినానే** **॥నేజూ॥**

5. **చందమామకు నడుమను కుండలాకృతిని ఆనందముగనున్న హరి గోవిందుని నేజూచినానే** **॥నేజూ॥**

**వివరము :-** ఇంతకుముందున్న తత్త్వములో "బాహ్యముగ దేవున్ని తెలియ లేము" అని తెలుసుకొన్నాము. ఆ విషయము తెలిసిన కొందరు అంతర్ముఖ జ్ఞానమును సంపాదించి బయటి చింతలు వదలివేసి శరీరము లోపలనే ఆత్మను దర్శించుకొన్న విధానమును ఇప్పటి తత్త్వములో తెలియజేశారు. వారు శరీరములో తెలుసుకొన్న విధానమును గురించి ఏమంటున్నారో క్రింద చూచెదము.

"బ్రహ్మ" అనగా పెద్ద అని అర్థము, బ్రహ్మము అనగా ప్రపంచములో అన్నిటికంటే పెద్దది దైవము. కనుక దేవున్ని 'బ్రహ్మము' అని పిలుచు

www.thraithashakam.org

చున్నాము. బ్రహ్మ అనగా త్రిమూర్తులలో ఒకరైన మూడుతలల బ్రహ్మని ఇక్కడ అనుకోకూడదు. అలాగే గురువు అనిన దేవుడనియే ఇక్కడ అర్థము చేసుకోవలెను, కానీ మంత్రోపదేశమిచ్చు గురువు అని అనుకోకూడదు. శరీరములో యోగము ద్వారనే ఆత్మను తెలియవచ్చును. శరీరములో ధ్యాసనుంచి ఆత్మను తెలియు విధానమును యోగము అంటున్నాము. ఈ విధముగ యోగము ద్వారా లోపలి ఆత్మను నే తెలుసుకొన్నానని ఒక యోగి చెప్పుచు 'నేజూచినానే నాలో బ్రహ్మము నేజూచినానే' అన్నాడు.

**1. కన్నుల నడుమను సన్నపు దిడ్డిన తిన్నగా వెలిగేటి పున్నమి చంద్రుని నేజూచినానే ॥నేజూ॥**

రెండు కన్నుల నడుమ శరీరము లోపల మూడు నాడుల కలయిక కలదు. శరీరము లోపల మూడులక్షల యాభైవేల నాడులలో ముఖ్యమైనవి సూర్య, చంద్ర, బ్రహ్మనాడులు. ఈ మూడునాడులలో సూర్య, చంద్రనాడులు బ్రహ్మనాడితో కన్నుల మధ్యలోనే కలసిపోవుచున్నవి. దీనినే త్రికూట స్థానము అంటున్నాము. ఈ స్థానములోనే మనిషి ఎరుక (జ్ఞప్తి) అంతయు వుండును. ఈ ఎరుకనే ఆత్మ అంటున్నాము. మనిషి యోగము చేత మనస్సు యొక్క సంకల్పములను లేకుండ చేసుకొనినా, ఏ ఆలోచనలేని ఎరుక మాత్రము మిగిలిపోవును. ఆలోచనలేని ఎరుకను చూచుచు యుండడమే నిజమైన యోగమగును. అపుడు తెలియబడు ఆత్మను పున్నమి చంద్రునిగ పోల్చి ఈ తత్త్వములో 'కన్నుల నడుమను సన్నపుదిడ్డిన తిన్నగా వెలిగేటి పున్నమి చంద్రుని నేజూచినానే' అన్నారు. ఇక్కడ 'సన్నపుదిడ్డి' అనగా 'బ్రహ్మనాడిలో సూక్ష్మముగ ఉన్న' అని అర్థము. 'వెలిగేటి పున్నమి చంద్రుడు' అంటే త్రికూట స్థానములోనున్న **ఆత్మ** అని అర్థము.

**2. పాలభాగమందు నీలజ్యోతుల నడుమ నోలలాడుచున్న పరలింగ మూర్తిని నేజూచినానే ॥నేజూ॥**

ఇదే విషయమునే క్రింది చరణములో కూడా చెప్పుచున్నారు. తల పాలభాగమునందు లోపల రెండు నాడుల నడుమనున్న బ్రహ్మనాడిలో ఆత్మ నివశిస్తూవున్నది. కావున 'పాలభాగమున నీలజ్యోతుల నడుమ నోలలాడుచున్న పరలింగమూర్తిని నేజూచినానే' అన్నారు. ఇక్కడ లింగమూర్తి అనగ ఆత్మ అనియు, నీలజ్యోతుల నడుమ అనగ సూర్యచంద్ర నాడుల మధ్య అని అర్థము.

**3. చూపులోపల పాపల నడుమను వ్యాపించి వెలిగేటి ఆ పరంజ్యోతిని నేజూచినానే ॥నేజూ॥**

శరీర మధ్యలో గల బ్రహ్మనాడిలో ఆత్మ నివాసముంటు శరీరమంతా వ్యాపించియున్నది. ప్రపంచ వస్తువులను చూపించు కళ్ళలో గల చూపుకు కాంతినిచ్చునది ఆత్మయే. అందువలన 'చూపులోపల పాపలనడుమను వ్యాపించి వెలిగేటి పరంజ్యోతిని నేజూచినానే' అన్నారు. పరంజ్యోతి అనగ ఆత్మ అని అర్థము.

**4. చక్షురాగ్రమునందు పశ్చిమవీధిని నిక్షేపమై వెలుగు సాక్షిభూతుని నేజూచినానే ॥నేజూ॥**

ఇదే విషయమునే క్రింది చరణములో కూడా చెప్పారు. కన్నుల కొనలకు ముందుగల స్థానములో నివాసమున్న ఆత్మను చూచానని చెప్పుచు 'చక్షురాగ్రమున పశ్చిమ వీధిని నిక్షేపమై వెలుగు సాక్షిభూతుని నాలో నేజూచినానే' అన్నారు.

**5. చందమామకు నడుమను కుండలాకృతిని ఆనందముగనున్న హరి గోవిందుని నేజూచినానే ॥నేజూ॥**

జ్ఞానములో సారాంశముగాయుండి జ్ఞాన మధ్యములో వ్రేలాడుచున్న చెవిపోగులాగ మెరియుచూ ఆనందమను పేరుతో యున్న ఆత్మను నేను చూచాను.

## 8. తత్త్వము

**మూడుకాల్వలు దాటలేరయ్యా ఇల మూఢజనులు మూడు కాల్వలు దాటలేరయ్యా మూడుకాల్వలతోను కూడుచు ఇడ పింగళ మధ్యమంబున చేరివుండని మూఢు లెల్లరు**

**1. ఓడ లేకను ఈద బొయ్యేరు - సంసారవారధిలో జాడ తెలియక మునిగిపొయ్యేరు ఆత్మజ్ఞానమను ఓడనెక్కి - ఏడుకొండలు దాటలేని మూఢులెల్లరు ॥మూడు కాల్వలు॥**

**2. బండరాళ్ళకు మ్రొక్కబొయ్యేరు - అజ్ఞానపూజలు చేయపూనేరు చేతిలోని జ్ఞానమెరుగక - చేతులెత్తి మ్రొక్కు మూఢులెల్లరు ॥మూడు కాల్వలు॥**

**3. బాధగురువుల పంచచేరేరు - బోధనెరుగక ఘోరముగ మోస పొయ్యేరు బోధలోని జ్ఞానమెరుగక - తత్త్వమంత తెలుసునను మూఢులెల్లరు ॥మూడు కాల్వలు॥**

**4. వేదమంత్రములు గొనుగ నేర్చేరు - బాహ్యయజ్ఞములు చేయపూనేరు మంత్రములోని మర్మమెరుగక - యజ్ఞములోని చావ తెలియని మూఢులెల్లరు ॥మూడు కాల్వలు॥**

www.thraithashakam.org

**5. ఉపదేశమంటు ఊర్లు తిరిగేరు - సన్యాసమంటు భార్యపిల్లల వదలి పొయ్యేరు ఉపదేశములోని ప్రదేశము తెలియక - సన్యాసములోని సారము తెలియని మూఢులెల్లరు ॥మూడు కాల్వలు॥**

**6. రాగముల భజన చేయపూనేరు - సన్మార్గులను లెక్కచేయక మాటలాడేరు భజనలోని మర్మమెరుగక - సన్మార్గులలోని జ్ఞానమెరుగని మూఢులెల్లరు ॥మూడు కాల్వలు॥**

**వివరము :-** మూడు కాల్వలేమి? ఆరు కాల్వలైనా దాటగలమనువారు గలరు. బాహ్యముగ ఉన్న కాల్వలైతే ఎన్ని అయినా దాటవచ్చును. కానీ ఇక్కడ చెప్పినది బయటి కాల్వలు కాదు. అంతరంగములోనున్న కాలువలు. మనిషి ఎప్పుడూ బయటి విషయములనే చూస్తుంటాడు, యోచిస్తుంటాడు. తన శరీరము లోపలికి ఎప్పుడూ ఆలోచించడు, కావున అంతరంగము యొక్క విషయము చాలామందికి తెలియకుండా పోయినది. బయట ఒక పేరుకల్గి సంచరించు మనిషి తన శరీరమును చూచుకొని శరీరమే తానని భ్రమించుచున్నాడు. వాస్తవానికి శరీరము వేరు, నేను వేరని తలవడము లేదు. నేను అనుకొనువాడు జీవుడుకాగా, శరీరము జీవుడు నివశించుటకు ఇల్లువలె ఉన్నది. శరీర గృహములో నివశించు జీవుడు కొంత జ్ఞానము తెలుసుకొన్నపుడే తాను వేరు, శరీరము వేరని తెలియగలడు. తానువేరని తెలిసిన తరువాత శరీరములో తానెట్లు నివశిస్తున్నది, ఎలా వ్యవహరించు చున్నది తెలియగలడు. అపుడు తాను నివశించు శరీరము ఒక యంత్రము లాంటిదని, యంత్రములో ఎన్నో భాగములున్నట్లు శరీరములో కూడా ఎన్నో భాగములున్నవని తెలియుచున్నది. అంతేకాక శరీరములోని భాగములు ఒక్కొక్కటి ఒక్కొక్క విధముగ పనిచేయుట వలన తాను శరీరములో

నివశించగల్గుచున్నానని కూడా తెలియుచున్నది. ఇలా తెలుసుకొంటూపోతే ఎన్నో రహస్యములు తెలియగలవు.

మన శరీరములో మూడు విధములైన గుణ భాగములున్నవని, ఒక్కొక్క భాగములో పంద్రెండు గుణములు గలవని వాటి ప్రభావము వలన యోచించగల్గుచున్నామని తెలియగలడు. మానవుడు దేవుని వైపు పోకుండుటకు ఈ మూడు గుణభాగములే పెద్ద ఆటంకము. వీటినే మాయ అనికూడా అందుము. ప్రయాణికునికి దాటలేని కాలువలు అడ్డమైనట్లు, దైవమార్గములో పయణించు వానికి మూడు గుణములు దాటలేని మూడు కాల్వలుగ అడ్డమైవున్నవి. మూడు గుణములను జయించడము దుస్సాధ్యమైన పనియని భగవద్గీతలో కృష్ణుడు కూడా ***"గుణమయి మమ మాయా దురత్యయా"*** అన్నాడు. గుణరూపములో ఉన్న మాయను దాటడము దుస్సాధ్యమైన పని అని దీని అర్థము. తామస, రాజస, సాత్త్వికమను మూడు గుణములనే ఈ తత్త్వములో మూడు కాలువలన్నారు. కొంత జ్ఞానమున్నవారే దాటుటకు సాధ్యముకాని గుణములను జ్ఞానములేని మూఢులు ఏమాత్రము దాటలేరు. కావున మూడు కాల్వలు దాటలేరయ్యా ఇల మూఢజనులు మూడు కాల్వలు దాటలేరయ్యా అన్నారు.

1. **ఓడ లేకను ఈద బొయ్యేరు - సంసారవారధిలో జాడ తెలియక మునిగిపొయ్యేరు ఆత్మజ్ఞానమను ఓడనెక్కి - ఏడుకొండలు దాటలేని మూఢులెల్లరు ॥మూడు కాల్వలు॥**

ఒక నదిని దాటుటకు చిన్న తెప్ప అవసరము. అట్లే సముద్రమును దాటుటకు ఓడ అవసరము. సంసారమను అతిపెద్ద సముద్రమును దాటుటకు బలమైన జ్ఞానమను ఓడ అవసరము. ఇప్పటి కాలములో

ప్రజలు ఏమాత్రము జ్ఞానము లేనివారై, సంసారసాగరమును ఈదబోయి దానిలోనే మునిగిపోవుచున్నారు. సంసారమునుండి గట్టెక్కవలయునంటే ఆత్మజ్ఞానమను ఓడ అవసరము. ఆత్మజ్ఞానమును తెలిసినవాడు సంసారములో ఉండినప్పటికీ దాని చిక్కులలో చిక్కుకొనక అంతరంగము లోని ఏడు కొండలనబడు సప్తనాడీకేంద్రములను దాటి, అవతలనున్న ఆత్మను తెలియగలడు. ఈ విషయమును తెలియజేయుటకు పై తత్త్వములో "ఓడలేకను ఈదబొయ్యేరు సంసారవారధిలో జాడ తెలియక మునిగి పొయ్యేరు ఆత్మజ్ఞానమను ఓడనెక్కి ఏడుకొండలు దాటలేని మూఢులెల్లరు మూడుకాల్వలు దాటలేరు" అన్నారు.

**2. బండరాళ్ళకు మ్రొక్కబొయ్యేరు - అజ్ఞానపూజలు చేయపూనేరు**
**చేతిలోని జ్ఞానమెరుగక - చేతులెత్తి మ్రొక్కు మూఢులెల్లరు**

**॥మూడు కాల్వలు॥**

ప్రపంచములో కృతయుగములోనే మనుషులకు జ్ఞానము తెలియ జేయు నిమిత్తము ప్రతిమలను వుంచి పూజించారు. అలా మొట్టమొదట తయారైన ప్రతిమ శివలింగము, తరువాత పాండురంగని ప్రతిమ. ఒకటి నిరాకారమును తెలియజేయుటకు లింగము పెట్టగా, రెండవది సాకారమును తెలియజేయుటకు ఉంచినది రంగని ప్రతిమ. ఈ రెండు దేవాలయములే సాకార, నిరాకార అర్థముతో కూడుకొన్నవి. ఈ రెండు దేవాలయములు మినహా ఏ దేవాలయములు పూర్వము ఉండెడివి కావు. కాలక్రమమున అజ్ఞానము పెరిగిపోయి ఎన్నో దేవాలయములు తయారైనవి. నిరాకార పరమాత్మకు సాకార భగవంతునికి చిహ్నములైన రెండు దేవాలయములను ఎవరూ గుర్తించలేకపోయారు. అర్థమున్న దేవాలయములను అర్థములేని దేవాలయములలోనికి కలిపివేశారు. జ్ఞానము తెలిసిన పెద్దలు ఇప్పటికీ

మొదటి రెండు ఆలయములే జ్ఞానముతో కూడుకొన్నవని తర్వాత తయారైనవన్నీ జ్ఞానభావము లేనివని చెప్పుచుందురు. అందువలననే కనిపించిన రాయికంత మ్రొక్కవద్దని 'చిల్లర రాళ్ళకు మ్రొక్కుచువుంటే చిత్తము చెడునుర' అన్నారు. నేటి పూజలు కూడ అర్థము లేనివై అందరూ ఎట్లు చేస్తుంటే అట్లు చేయవలెనని చేస్తున్నారు తప్ప వాటి అర్థము పూర్తి తెలియదు. అందువలన అర్థములేని అజ్ఞాన పూజలు చిల్లర దేవుళ్ళకు చేస్తూపోతున్నారు. అందువలన ఈ తత్త్వములో "బండరాళ్ళకు మ్రొక్కబొయ్యేరు, అజ్ఞాన పూజలు చేయపూనేరు" అని అన్నారు.

పరమాత్మ నిరాకారమును, భగవంతుని సాకారమును తెలియజేయు నిమిత్తము, పూర్వము తెలిసిన జ్ఞానులు ముక్కు ముఖము ఆకారములేని లింగమును, ముక్కు ముఖమున్న ప్రతిమను తయారుచేసి యుంచినట్లు, అంతరంగములోని జీవాత్మ, ఆత్మ, పరమాత్మల వివరము తెలియునట్లు, దేవుడే మానవుని అరచేతిలో మూడు రేఖలు అమర్చి పుట్టించాడు. ప్రతిమ ఆకారమున్న నామాల దేవుడైన ఆలయములలో ఇదే విషయమును తెలియజేయునట్లు హస్తమును చూపుచూ ప్రతిమ ఆకారముండును. హస్తములో ఎంతో జ్ఞానమున్నదని పూర్వము పెద్దలు కూడా చెప్పెడివారు. అందువలన ఉదయము నిద్రలేస్తూనే ఎవరి ముఖము చూడక ముందే తన హస్తములోని రేఖలను చూచుకొమ్మని చెప్పెడివారు. చేతులలో ఆత్మ పరమాత్మల జ్ఞానమున్నదని తెలియక, చిల్లర దేవుళ్ళకు హస్తములెత్తి మ్రొక్కు చున్నారు. అందువలన ఈ తత్త్వములో "చేతిలోని జ్ఞాన మెరుగక చేతులెత్తి మ్రొక్కు మూఢులెల్లరు మూడు కాల్వలు దాటలేరయ్యా" అన్నారు. అందువలన పెద్దల మాట ప్రకారము హస్తములోని ఆత్మ పరమాత్మల వివరము తెలిసి, అట్లే గుడులలోని సాకార, నిరాకార గుర్తులైన రెండు గుడులను తెలిసి పూజలు చేస్తాము.

www.thraithashakam.org

**3. బాధగురువుల పంచచేరేరు - బోధనెరుగక ఘోరముగ మోస పొయ్యేరు**
**బోధలోని జ్ఞానమెరుగక - తత్త్వమంత తెలుసునను మూఢులెల్లరు**
**॥మూడు కాల్వలు॥**

దేశములోని గురువులందరు ఏదో ఒక బోధ చెప్పుచున్నప్పటికీ అందరిని బోధగురువులనుటకు వీలులేదు. బోధలు చెప్పు గురువులలో కూడా బోధగురువులు, బాధగురువులని రెండు రకములు కలరు. బాహ్యముగ శరీరమునకు, అంతరంగమున మనస్సుకు పనిని కల్పించు ఎటువంటి బోధలు చెప్పువారైనా బాధగురువులే అగుదురు. శరీరమునకు మనస్సుకు పనిలేని బోధలు చెప్పువారే బోధగురువులగుదురు. శరీరము, మనస్సు పనులలో లగ్నమైనపుడు ప్రపంచమే తెలియును కానీ ఆత్మ తెలియదు. బయట శరీరము, లోపల మనసు పనిని మానుకొన్నపుడే ఆత్మ తెలియబడు బ్రహ్మయోగమగును. అట్లుకాక వ్రతక్రతువులు, యజ్ఞ యాగములు, వేదపఠనములు, దానములు, మంత్రబోధతో కూడిన తపస్సులను బోధించువారు బాధగురువులే అగుదురు. అందువలననే భగవద్గీతలో కూడా "యజ్ఞముల వలన, వేదాధ్యయణము వలన, దానముల వలన, తపస్సుల వలన దేవుడు తెలియబడడని" విశ్వరూప సందర్శన యోగమను అధ్యాయములో 48వ శ్లోకమున మరియు 53వ శ్లోకమున చెప్పబడి యున్నది.

ఈ విధముగ బాధ, బోధ గురువులుండగా జ్ఞానమును తెలుసు కోవాలనుకొన్న ప్రజలు గురువులను గుర్తించలేక, జ్ఞానములోని తారతమ్యములు తెలియక, ఆధ్యాత్మికవిద్యలో ఘోరముగ మోసపోవు చున్నారు. అట్లు మోసపోయినవారు తాము తెలుసుకొన్నది బాధబోధ లేక ఆత్మబోధ అని తెలియక, తమకు అంతా తెలుసునను అహముతో దేవున్ని,

www.thraithashakam.org

దేవుని జ్ఞానము పూర్తిగా తెలుసునని చెప్పుకొంటున్నారు. ఇటువంటివారు ఎప్పటికీ తమలోని ఆత్మను తెలియలేరు. అందువలన ఈ తత్త్వములో "బాధ గురువుల పంచచేరేరు, బోధ తెలియక ఘోరముగ మోసపొయ్యేరు, బోధలోని జ్ఞాన మెరుగక తత్త్వమంత తెలుసునను మూఢులెల్లరు మూడు కాల్వలు దాటలేరయ్యా" అన్నారు.

**4. వేదమంత్రములు గొనుగ నేర్చేరు - బాహ్యయజ్ఞములు చేయపూనేరు మంత్రములోని మర్మమెరుగక - యజ్ఞములోని చావ తెలియని మూఢులెల్లరు ॥మూడు కాల్వలు॥**

దైవ పూజలలో ఆధ్యాత్మికవిద్యలో మంత్రమునకు, యజ్ఞమునకు విశేషమైన విలువగలదు. అందువలన ఎన్నో మంత్రములు నేర్చి దైవపూజలు, ఎన్నో యజ్ఞములు చేసి దైవశాంతులు చేయుట నేటి సమాజములో అదియు కొందరిలో పాదుకొని పోయిన ఆచారములు. ఏమి చేయక పూర్తి అజ్ఞానముతో చాలామంది వుండగా వారికంటే మేము గొప్పయని, జ్ఞానులమని మంత్రపఠనములు, యజ్ఞములు చేయువారు కలరు. ఏ పూజలు చేయని వారికంటే మంత్రములతో పూజచేయువారు, యజ్ఞములు చేయువారు గొప్పగా కనిపిస్తున్నప్పటికీ దానివలన దైవము తెలియబడదని భగవద్గీతలో కూడా చెప్పారని పైన వ్రాసుకొన్నాము. అటువంటపుడు యజ్ఞములకు, మంత్రములకు విలువలేదా! అని అడుగవచ్చును దానికి మా సమాధానము ఏమనగా!

యజ్ఞములకు, మంత్రములకు ఎంతో విలువ ఉన్నది. కానీ అవి మీరనుకొన్నట్లు అందరూ చేయు యజ్ఞములు కావు, అట్లే మంత్రములు కూడా అందరూ అనుకొన్నట్లు పఠించునవి కావు. బ్రహ్మవిద్యాశాస్త్రము

ప్రకారము మంత్రమునకు, యజ్ఞమునకు ప్రత్యేక అర్థము, అనుభవము కలదు. **మంత్రమనగా తనకు తాను పఠించబడునది, యజ్ఞమనగా తనను తాను జరుగబడునది.** మనిషి పఠించకనే ఉచ్ఛరించబడునది మంత్రము, అలాగే మనిషి చేయకనే చేయబడునది యజ్ఞము. ఇదెక్కడి వింత అనుకోవద్దండి ఉన్న సత్యము అంతే. ఈ విషయము తెలియకనే అందరూ పొరబడుచున్నారు. అందువలన గీతలో కూడా 'బాహ్య యజ్ఞముల వలన కానీ, బాహ్యమంత్రముల వలన కానీ దేవుడు తెలియబడడని' తేల్చి చెప్పారు. యజ్ఞములకు మంత్రములకు ప్రత్యేక అర్థము, విలువ ఉన్నదని చెప్పారే అని మమ్ములను ప్రశ్నించితే ఆ మాట వాస్తవమే. యజ్ఞములు మన శరీరములో మన ప్రమేయము లేకుండానే ప్రతి నిత్యము జరుగుచున్నవి. అలాగే మంత్రము ప్రతి నిత్యము మన శరీరములో మన ప్రమేయము లేకుండా జపించబడుచున్నది. శరీరములో రెండు రకముల యజ్ఞములు జరుగుచున్నవి. అనేక మంత్రములు మ్రోగుచున్నవి. యజ్ఞములలో శ్రేష్ఠమైన యజ్ఞము ఒకటి, మంత్రములలో శ్రేష్ఠమైన మంత్రమొకటి కలదు. యజ్ఞములలో **'జ్ఞానయజ్ఞము'**, మంత్రములలో **'ఓం'** శబ్దము శ్రేష్ఠమైనవి. ఏ మనిషి అయినకాని జ్ఞానయజ్ఞమును చేయుట వలన, ఓం మంత్రమును స్మరించుట వలన కానీ ముక్తి పొందవచ్చును.

బాహ్యయజ్ఞముల చేత, బాహ్యమంత్రముల చేత పొందని మోక్షమును అంతరంగమున స్వయముగ ఆత్మ చేయు జ్ఞానయజ్ఞములో నీవు (జీవుడు) ఆత్మతో కలసి చేసితే కర్మ కాలిపోవును. అలాగే అంతరంగమున స్వయముగ ఆత్మ జపించు ఓం అక్షరము నీవు (జీవుడు) ఆత్మతో కలిసి జపించుట వలన ముక్తి పొందవచ్చును. ఈ రహస్యము తెలియక మంత్రములోని మర్మమును, యజ్ఞములోని సారాంశమును తెలియనివారు

www.thraithashakam.org

మూడు గుణములలోనే చిక్కుకొని, కర్మ సంపాదించుకొనుచుందురు. మంత్రము మనలోనే గలదని తెలియక స్వార్థము కొరకు బయటి మంత్రములకు అలవాటుపడినారు. స్వార్థముతోనే పఠించుచున్నారు. ఎన్నో కోట్ల సంవత్సరముల నుండి విశ్వమును స్థాపించి, నడిపించు దేవున్ని మరచిపోయి కొద్ది కాలము ఉండిపోవు జీవితమును గొప్పగా ఎంచుకొని, దానిలోని బ్రతుకే విలువైనదని, బ్రతుకుట కొరకు, బ్రతుకు తెరువులో లాభము కొరకు మంత్రములుచ్ఛరించడము యజ్ఞములు చేయడము జరుగుచున్నది. వ్యాపారస్తుడు అంగడికి (కొట్టుకు) వేయబడిన తాళముకు మ్రొక్కుచున్నాడు, వాకిలికి మ్రొక్కుచున్నాడు, లోపలికి పోయి అన్యదేవతలకు మ్రొక్కుచున్నాడు. అసలైన దేవున్ని, అన్నిటికీ ఆధారమైన దేవున్ని, తనను నడిపించు దేవున్ని మరచిపోవుచున్నాడు. ప్రజలు దేవున్ని మరచి చేయు అజ్ఞాన పనులను, స్వార్థపనులను చూచిన పెద్దలు ఈ తత్త్వములో "వేదమంత్రములు గొనుగ నేర్చేరు, బాహ్యయజ్ఞములు చేయ పూనేరు, మంత్రములోని మర్మమెరుగక, యజ్ఞములోని చావ తెలియని మూఢులెల్లరు మూడు కాల్వలు దాటలేరయ్యా" అన్నారు. మంత్రముల విషయము తెలియని వారు యజ్ఞముల వాస్తవమును తెలియనివారు మూడు గుణములను జయించలేక ముక్తి పొందలేక జనన మరణ చక్రములోనే చిక్కుకొందురని దీని అర్థము.

**5. ఉపదేశమంటు ఊర్లు తిరిగేరు - సన్యాసమంటు భార్యపిల్లల వదలిపొయ్యేరు ఉపదేశములోని ప్రదేశము తెలియక సన్యాసములోని సారము తెలియని మూఢులెల్లరు ॥మూడు కాల్వలు॥**

మనుషులలో కొందరు తాము గురువు కావాలని కాంక్ష కలిగి యుందురు. అందువలన కొంత జ్ఞానము తెలిసిన వెంటనే, పూర్తి జ్ఞానమును

సంపాదించకనే గురువులుగా మారిపోవుచుందురు. అంతటితో ఊరుకోక శిష్యులను సంపాదించుకోవడములో మునిగిపోవుదురు. తాళి కట్టితే భార్య అయినట్లు ఉపదేశమిచ్చితే శిష్యులయ్యే విధానముంది కాబట్టి అడిగినా అడగకున్నా ఉపదేశమిచ్చి శిష్యులను చేసుకోవడము పనిగా పెట్టుకొందురు. ఉపదేశమిచ్చు గురువుల పోటీ కూడా ఎక్కువగా ఉండుట వలన గురువులే ఊరూరు తిరిగి అక్కడి ప్రజలకు ఉపదేశమిచ్చుట జరుగుచున్నది. ఒక ఇంటిలో ఒకరు గురు ఉపదేశము మీద ఆసక్తి కనబరిస్తే చాలు, ఆ ఇంటికి పోయి ఇంటిలోని వారందరికీ బలవంతముగా ఉపదేశమిచ్చు వారు కూడా గలరు. పూర్వకాలము గురువులను వెదకుచూ శిష్యులు పోవుచుండెడి వారు. ఈ కాలములో గురువులే శిష్యులను వెదకుచు వచ్చుచున్నారు. ఈ విధముగా ఉపదేశమని ఊరూరా తిరుగుచూ గురువులమను భ్రమలో కొందరు గలరు.

అలాగే సన్న్యాసమంటే మరియు సంసారమంటే అర్థము తెలియని వారు, భార్యాపిల్లలే సంసారమనుకొని, వారిని వదలడమే సన్న్యాసమనుకొని, ఎందరో భార్యపిల్లలను వదలిపోయారు. పూర్వకాలములో గౌతమ బుద్ధుడు ఒక సంవత్సరము కొడుకును, చిన్న వయస్సుగల భార్యను సన్న్యాసమని వదలిపోయాడు. ఆదిశంకరాచార్యులు, వివేకానందుడు సన్న్యాసమని పెళ్లే చేసుకోలేదు. అప్పటి కాలములోనూ, ఇప్పటి కాలములోనూ సన్న్యాసము అంటే సంసారమును వదలడమను అర్థము గాఢముగ ఉన్నది. అందువలన ఇప్పటి స్వాములందరూ కషాయగుడ్డలు కట్టి, పెళ్లి చేసుకోకుండా కొందరు, ముందే చేసుకొన్నవారు విడిచిపెట్టిన వారు కొందరు గలరు. ఈ విధముగా సన్న్యాసము తీసుకోవడముగానీ, గురువులుగా మారి ఉపదేశమిచ్చుటగానీ మంచి పద్ధతంటామా? అని అడిగితే కొందరు పెద్దలు ఒప్పుకోకుండా

ఉపదేశమందు మర్మము, సన్న్యాసమందు సారము తెలియకపోతే మూడు గుణములు దాటలేవు మాయను జయించలేవు అంటున్నారు. యజ్ఞములు మంత్రములు ఉన్నట్లే గురువులు, గురూపదేశములు రెండు రకములు కలవు. మనుషులు గురువులుగా మారినవారు ఒక రకముకాగా, దేవుడే భగవంతునిగ వచ్చి గురువుగా మారడము రెండవరకము. మనిషి గురువుగ మారితే **గురువు** అనవచ్చును, దేవుడు గురువుగా వస్తే **'జగద్గురువు'** అనవచ్చును. ప్రపంచమంతటికీ దేవుడొక్కడే నిజగురువు. అతను మోక్షము నుండి మనిషిగ వచ్చి తిరిగి మోక్షమునకే పోగలడు. కానీ మనిషి గురువుగా తయారైనప్పటికీ మోక్షమునకు పోతాడను నమ్మకము లేదు. మనుష్య గురువు తాను మోక్షమునకు పోలేని స్థితిలో ఉండి కూడా ఇతరులకు మోక్షము కల్గిస్తానని ఉపదేశమిచ్చి శిష్యులుగా చేసుకోవడము చాలా వింతగా ఉంటుంది. దైవము భూమి మీదకు గురువుగా వస్తే ఎవరికీ మంత్రోపదేశము చేయడముగానీ, శిష్యులను చేర్చుకోవడముగానీ చేయడు. తాను చెప్పవలసిన ధర్మములను మానవాళికి చెప్పిపోవును తప్ప తాను గురువునని కూడా చెప్పుకోడు. ఇట్లు మానవ గురువునకు, దైవగురువునకు ఎంతో వ్యత్యాసముండును. అందువలన ఈ తత్త్వములో 'ఉపదేశమని ఊర్లు తిరగవద్దని, ఉపదేశములోని మర్మమును తెలుసుకొమ్మని' తెలిపారు.

సంసారము కూడా రెండు రకములుగా కలదు. ఒకటి బయటి సంసారము, మరొకటి లోపలి సంసారము. బయటి సంసారములో సభ్యులు ఇద్దరు నుండి పదిమంది వరకు కానీ, పదిహేను మంది వరకు కానీ ఉండగలరు. సామాన్యముగా నలుగురైదుగురు గల చిన్న సంసారములే ఎక్కువగా ఉండును. మనిషి అజ్ఞానములో ఉండినపుడు, శరీరమే తాననుకొన్నపుడు, భార్యాపిల్లలనే సంసారమనుకోవడము సహజము.

www.thraithashakam.org

అజ్ఞానుల దృష్టిలో భార్యాపిల్లలే సంసారము కావున ఇది ఒక రకమైన బయటి సంసారము. ఈ సంసారమును వదలుకోవడము వలన సన్యాసమవుతుందని అనుకోవడము పొరపాటు. ఎందుకనగా మనిషి అజ్ఞానములో ఉండి, అజ్ఞానముతో దేహమే నేనను అహముతో, భార్యాపిల్లలే సంసారము అని ఊహించుకొన్నది కావున ఇది దేవుని లెక్కలో సంసారము కాదు.

దేవుని లెక్కలోని సంసారము సన్యాసము వేరుగా ఉన్నవి. సజీవ మనిషిలో జీవుడు శరీరములో నివశిస్తున్నాడు. సంసారము జీవునికే కావున జ్ఞానము ప్రకారము శరీరము లోపల జీవుడు 24 మందితో కాపురము చేయుచున్నాడు. అనగా రెండు డజన్ల సహచరులతో జీవుడు కాపురము చేయుచున్నాడు. బయటి కాపురము ఎంతమంది ఉండినా, లోపలి కాపురము మాత్రము 24 మందితోనే అని చెప్పవచ్చును. శరీరములో తనతోపాటు కాపురమున్నవారే జీవునికి నిజమైన సంసారము. అంతరంగములోని సంసారమును వదలడమే నిజమైన సన్యాసమని భగవద్గీతలో కూడా తెలియబరచబడినది. ***శరీరము లోపల మనస్సు, బుద్ధి, చిత్తము, అహము, అలాగే ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు వాయువులు, ఐదు తన్మాత్రలు అని మొత్తము 24 తోటి జీవుడు ఉంటూ జీవయాత్ర సాగిస్తున్నాడు. శరీరాంతర్గతములో గల 24 భాగములతో జీవుడు సంబంధము పెట్టుకోకపోవడమే నిజమైన సన్యాసము.*** దీనివలన యోగప్రాప్తి మోక్షప్రాప్తి కల్గును. అట్లుకాక బయటి వారిని వదలితే లోపలి కర్మ తెగదు, మోక్షము లభించదు. పూర్వము స్వాములుగానీ, నేటి స్వాములుగానీ బాహ్య సంసారమును వదలడము వలన మూడు గుణములు వదలవు. కావున వారు సన్యాసులు కాదని తెలియుచున్నది. అందువలన

www.thraithashakam.org

ఈ తత్త్వములో "సన్న్యాసమంటూ భార్య పిల్లలు వదలి పొయ్యేరు, సన్న్యాస మందు సారము తెలియని మూఢులెల్లరు మూడు కాల్వలు దాటలేరయ్యా" అని అన్నారు. ఇప్పటికైనా తత్త్వములోని అర్థము తెలిసి నిజమైన సన్న్యాసము తీసుకొందాము.

**6. రాగముల భజన చేయపూనేరు - సన్మార్గులను లెక్కచేయక మాటలాడేరు**
**భజనలోని మర్మమెరుగక - సన్మార్గులలోని జ్ఞానమెరుగని మూఢులెల్లరు**
**॥మూడు కాల్వలు॥**

గ్రామీణప్రాంతములో భజన చేయడమే ముఖ్యమైన భక్తిగా ఉన్నది. గుడిలో గుంపుగ కూడి అనేక దేవుళ్ల కీర్తనలను భజన చేసి అదియే భక్తి అని తృప్తి చెందుచుందురు. గ్రామీణులకు భజన తప్ప ఏ జ్ఞానము తెలియదు. ఎవరైనా గురువులు తోడైనప్పటికీ వారు జ్ఞానమును తెలుపక భజనకే ప్రాముఖ్యతనిచ్చుట వలన భజన తప్ప జ్ఞానము తెలియని స్థితిలో వారుండిపోయారు. భజన చేయువారికి ఎందరో దేవుళ్ళు తప్ప అందరికీ అధిపతియైన దేవుడు తెలియడు. మత్తుత్రాగువారికి అది అలవాటైనట్లు భజన చేయువారికి కూడా అది ఒక అలవాటైపోవును. భజన చేయువానికి తప్పనిసరిగా భజనకు పోవాలనిపిస్తుంది. ఒక్క రోజుపోకపోయినా అసంతృప్తిగా ఉంటుంది. ముఖ్యముగా వారికి మనమెవరము? ఎవరిని భజించాలి? అసలు భజన అంటే ఏమిటి? అను వివరము తెలియదు. ఇటువంటివారు తమకే నిజమైన భక్తికలదను భావముతో సన్మార్గులను, జ్ఞానులను లెక్కచేయక హేళనగా మాట్లాడుచుందురు. ఈ విషయమునే తత్త్వములో "రాగముల భజన చేయ పూనేరు, సన్మార్గులను లెక్కచేయక మాటలాడేరు" అన్నారు.

భజన రాగములతో కూడుకొన్నది కాదనీ, పాటలభజన కంటే అంతరంగములో జ్ఞానముతో భజించడము గొప్ప అని తెలియదు. పూజించడము, భజించడము అను పదములలో మొదటి అక్షరము మాత్రము వేరుగ ఉన్నది. పూజించడము అని పలుకకూడదు, 'పూజ చేయడము' అని పలుకడము సరియైనది. అలాగే భజించడము అని పలుకకూడదు, 'భజన చేయడము' అని పలకాలి. పూజ, భజన అనునవి వాస్తవ పదములు. పూజ అనగా బాహ్యముగా చేయు ఆరాధన క్రమము. భజన అనగ అంతరంగమున చేయు ఆరాధన అని అర్థము. ఇంకనూ వివరముగా చెప్పుకొంటే పూజ, భజన అను రెండు పదములలోను "జ" కలదు "జ" అనగ పుట్టునదని అర్థము. జ్ఞానము తెలిసి ఆ అర్థముతోనే దేవున్ని బాహ్యముగా ఆరాధించడము వలన అందులో జ్ఞానాగ్ని లేక జ్ఞానశక్తి పుట్టగలదు. అలాగే జ్ఞానము తెలిసి అంతరంగమున ఆరాధించడము వలన అందులో కూడా జ్ఞానశక్తి పుట్టగలదు. కంటికి కనిపించని జ్ఞానశక్తిని బాహ్యముగా పొందడమును పూజ అనియూ, అదే శక్తిని అంతరంగమున పొందడమును భజన అనియూ పూర్వము అనెడివారు. ఈ కాలములో పూజకు భజనకు అర్థము తెలియకపోయిన దానివలన పూజలు భజనలు అనేక దారులు పట్టిపోయినవి. సన్మార్గులైన జ్ఞానులు జ్ఞానశక్తిని పొంది యుందురు. అటువంటి జ్ఞానుల జ్ఞానముగాని, వారిలోని శక్తినిగాని తెలియక హేళనగా మాట్లాడడము వలన తప్పక కర్మ చేకూరును. అందువలన జ్ఞానులలో తెలియకుండ ఉన్నదేదో తెలియనివారు, భజనలో నిజ భజన ఏదో తెలియనివారు మూడు గుణములను దాటలేరు. ఈ విషయమునే తత్త్వములో "భజనలోని మర్మమెరుగక, సన్మార్గులలోని జ్ఞానమెరుగని మూఢులెల్లరు మూడు కాల్వలు దాటలేరయ్యా" అన్నారు.

ఈ తత్త్వమును చూచిన తరువాత గురువులలో బాధ గురువులెవరో, బోధ గురువులెవరో, చిల్లర దేవతలెవరో, దేవ దేవుడెవరో, మంత్రములేవో, యజ్ఞములేవో, ఉపదేశమేదో, సన్యాసమేదో, పూజ ఏదో, భజన ఏదో, అసలు జ్ఞానమంటే ఏమిటో తెలుసుకొనుటకు ప్రయత్నించవలెను.

## 9. తత్త్వము

శ్రీగురు చరణారవిందములు నమ్మికొలుతుము అనుదినమూ
ఇదే రీతిగ అదే బోధగ అనుదినమూ కోరితిమీ

**1) ఆగర్భశత్రువుల ఆర్గురిని చంపేవిధమూ తెలియని మాకూ**
**తేజమైన కత్తుల నిమ్మని కోరితిమీ ॥ శ్రీ గురు ॥**

**2) ఐదు పడగల పాము విషముతో బాధపడే మాకూ**
**బోధామృతమనే మందిమ్మని కోరితిమీ ॥ శ్రీ గురు ॥**

**3) ఏడు కొండలు ఎక్కే మార్గము తెలియని మాకూ**
**కంటకములు లేని మార్గము తెలుపమని కోరితిమీ ॥ శ్రీ గురు ॥**

**4) అండ పిండ బ్రహ్మాండము తెలియని మాకూ**
**అంతా నిండియుండే వానిని తెలుపమని కోరితిమీ ॥ శ్రీ గురు ॥**

**5) పుట్టలోని పామును బట్టే విధము తెలియని మాకూ**
**పామును పట్టే కట్టుమంత్రము తెలుపమని కోరితిమీ ॥ శ్రీ గురు ॥**

**వివరము :–** పరమాత్మ సాకార ఆకారమైన భగవంతుడే నిజమైన గురువు. అతనే జగద్గురువు. జగత్తుకంతటికీ వర్తించు బోధ తెలియజేయువాడు కనుక ఆయనను **'జగద్గురువు'** అంటున్నాము. శరీరములో నివశించు

జీవునికి శరీరములో నివశించక పరమాత్మలో కలిసిపోవు జ్ఞానమును తెలుపు గురువు యొక్క పాదములకు నమస్కరించుచూ మోక్షము పొందు జ్ఞానమును తెలుపమని కోరుచూ ఒకరు "శ్రీగురు చరణారవిందములు నమ్మి కొలుతుము అనుదినమూ, ఇదేరీతిగ అదే బోధగ అనుదినము కోరితిమీ" అన్నారు.

**1) ఆగర్భశత్రువుల ఆర్గురిని చంపేవిధమూ తెలియని మాకూ**
**తేజమైన కత్తుల నిమ్మని కోరితిమా ॥ శ్రీ గురు ॥**

పుట్టుకతోనే మొదలైన శత్రుత్వమును ఆగర్భశత్రుత్వము అంటాము. మొదటినుండి ఉన్న శత్రువును ఆగర్భశత్రువు అంటాము. మన పుట్టుకతోనే మన శరీరములోనే మనలను పాపములలో ముంచి కష్టముల పాలుచేయు ఆరు చెడు గుణములు గలవు. అట్లే పుణ్యములను అంటగట్టి సుఖములందు ముంచు ఆరు మంచి గుణములు గలవు. పుణ్యమును తగిలించు మంచి గుణములను మిత్రులుగ లెక్కించినపుడు పాపములను తగిలించి కష్టముల పాలుచేయు చెడు గుణములను శత్రువులుగ లెక్కించ వలసియున్నది. 1) కామ 2) క్రోధ 3) లోభ 4) మోహ 5) మద 6) మత్సరమను ఆరు గుణములు మన శరీరములోనే శత్రుపాత్ర వహించుచున్నవి. ఇవి జీవుని పాలిట భీకరమైన బలమైన శత్రువులు. ఈ ఆర్గురు శత్రువులను జయించవలెనంటే జీవునికి జ్ఞానము అవసరము. లోకములో జ్ఞానమను కత్తుల చేతనే గుణములనబడు శత్రువులను జయించవచ్చును. అందువలన ఈ తత్త్వములో "ఆగర్భశత్రువులు ఆర్గురిని చంపే విధము తెలియని మాకు తేజమైన కత్తులనిమ్మని కోరితిమా" అని ఒక జిజ్ఞాసి అడిగినట్లు గలదు.

**2) ఐదు పడగల పాము విషముతో బాధపడే మాకూ**
**బోధామృతమనే మందిమ్మని కోరితిమా ॥ శ్రీ గురు ॥**

www.thraithashakam.org

భూమి మీద ఎక్కడైనా ఒక పాముకు ఒక తలమాత్రముండును. కాని మన శరీరములో మనస్సు అను పాముకు ఐదు తలలు గలవు. ఒక్కో తలలో ఒక్కో విధమైన విషయమున్నది. మనస్సు ఒకటే అయినా, అది జీవునికి అందించు విషయములు ఐదు రకములుగ ఉన్నవి. మనస్సుకు గల ఐదు తలలు వరుసగ 1) కన్ను 2) చెవు 3) ముక్కు 4) నాలుక 5) చర్మము. శరీరములోని ఈ ఐదు ఇంద్రియములు ఐదు రకముల విషయములను జీవునికి అందించుచున్నవి. ఈ ఐదు విషయములతో జీవుడు అహర్నిశలు విలవిలలాడి పోవుచున్నాడు. విషమునకు ఏ మనిషైన బాధపడక తప్పదు. అలాగే మనిషిలోని ఐదు పడగల విషమునకు తప్పక బాధపడవలసి వస్తున్నది. విషమునకైతే బాధపడవచ్చునుగాని విషయమునకు ఎందుకు బాధపడవలెనని కొందరు అనుకోవచ్చును. దానికి మా వివరమేమనగా విషము అనునది అందరికీ తెలిసినదే. ఆహారమునకు విషమును చేర్చితే విష ఆహారమగును. అట్లే పాణీయమునకు విషమును చేర్చితే విష పాణీయమగును. రెండు పదములలోను **"విష"** అని చెప్పి విషము అని ఎందుకు చెప్పలేదనగ విష అను రెండక్షరములే పూర్తి అర్థమునిచ్చుచున్నవి. ఒక అర్థముతో కూడిన అక్షరములకు పదము సంపూర్ణమగుటకు "ము" అను అక్షరమును కలుపుకొనుచుందుము. అందువలన విష అను అర్థమునిచ్చు రెండక్షరములను పదము చేయుటకు "ము" ను కలిపి విషము అంటున్నాము.

అలాగే యమ బాధలు అను పదములో **యమ** అను అర్థమునిచ్చు అక్షరమునకు **'డు'** కలిపి యముడు అంటున్నాము. నిజానికి ఈ పదము **'యమడు'** అని పలుకవలెను కానీ యముడు అని పలుకుట అలవాటై పోయినది. విషము వలన యమలోకమునకు చేరవలసిందే అనగా అక్కడ

బాధలు అనుభవించవలసిందే. కావున బాధలను చూచించు యముడు అను పదమును హానిని కలుగజేయు విషము అనుపదమును తీసుకొని **విష+యము** అను వాటిని కలిపితే **విషయము** అగుచున్నది. విషయము అను పదములో హానికరమైన బాధలు కలుగజేయునదని అర్థము కలదు. మనస్సను పాము ప్రపంచ విషయమును ఐదు విధములుగ కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము అనువాటి ద్వారా తెలియజేయుచున్నది. విషయములోనే హానికరమైన బాధలతో కూడుకొన్న అర్థముండుట వలన ఐదు ఇంద్రియములను ఐదు పాము తలలుగా, మనస్సును పాముగా వర్ణించి వాటినుండి హాని కలుగుచున్నదని తెలుపుటకు ఈ తత్త్వములో "ఐదు తలల పాము విషముతో బాధపడే మాకు" అన్నాడు.

విషమునకు విరుగుడు ఔషధము. మనస్సనెడి పాము పడగల విషమునకు మామూలు మందు సరిపోదు దానికి జ్ఞానమనే మందే విరుగుడు కావున "బోధామృతమనే మందిమ్మని కోరితిమి" అని అన్నారు. దీనిని బట్టి విషయములలో విషమున్నదోయన్న అని కొందరన్నారు. ఇప్పటినుండి విషయములపట్ల బహు జాగ్రత్తగా ఉండవలెను.

**3) ఏడు కొండలు ఎక్కే మార్గము తెలియని మాకు**
**కంటకములు లేని మార్గము తెలుపమని కోరితిమా ॥శ్రీ గురు॥**

పూర్వకాలములో మొట్టమొదట తయారైన దేవాలయము శివలింగము కలది. తరువాత రెండవది రూపము కల్గిన నామాలప్రతిమ. ఒకటి నిరాకారమైన పరమాత్మకు గుర్తు, రెండవది సాకారమైన భగవంతునికి గుర్తని **'దేవాలయ రహస్యములు'** అను గ్రంథములో తెలుసుకొన్నాము. మనిషిలో దైవజ్ఞానము వృద్ధి అగుటకు ఈ రెండు దేవాలయములు

www.thraithashakam.org

అవసరమని ఆనాటి జ్ఞానులు వీటిని నిర్మించారు. దైవజ్ఞానము తెలియుటకు ఆనాడు ఎంతో యోచించి సూత్రబద్ధముగా, శాస్త్రబద్ధముగా తీర్చిదిద్ది తయారు చేయబడినవే రెండు దేవాలయములు. పూర్వము విభూతి రేఖలున్న లింగము, మూడు నామములున్న ప్రతిమ దేవాలయములు తప్ప ఇతర దేవాలయములుండేవి కావు. తర్వాత కొంత కాలమునకు ఈ రెండు దేవాలయముల యొక్క జ్ఞానము వివరము తెలియకుండా పోయినది. వాటి విశేషతను గురించి చెప్పువారు లేకుండాపోయారు. ఇటువంటి పరిస్థితిలో మాయకు మంచి అవకాశము ఏర్పడినది. మాయ ప్రేరణతో మనుషులలో అజ్ఞానము పెరిగిపోయినది. అటువంటపుడు రాముని దేవాలయము తర్వాత ఆంజనేయుని దేవాలయము తయారైనవి. వీటి తర్వాత అనేకమైన దేవాలయములు తయారైనవి.

ఆధ్యాత్మిక విద్యలో భారతదేశము మొట్టమొదటిది. ప్రపంచములో అన్ని దేశములకంటే దైవజ్ఞానములో భారతదేశమే ప్రథమ స్థానములో ఉన్నది. మనము నివశించు దేశమునకు మొదట ఇందూదేశమను పేరుండేది. ఆ పేరు కొంత మార్పుతో హిందూదేశమని ఈ రోజుకు పిలువబడుచున్నది. అయినప్పటికీ హిందూదేశమునకు భారతదేశమను రెండవ పేరు కూడా కొంతకాలమునకు ఏర్పడినది. వ్యవహారములలో హిందూదేశము అను పేరుకంటే భారతదేశమను పేరే ఎక్కువగలదు. మన దేశము అన్ని దేశములకంటే ఆధ్యాత్మిక జ్ఞానములో మొట్టమొదటిది. కావున ఈ దేశమునకు **ఇందూ** అని అర్థముతో కూడుకొన్న పేరును కల్గియున్నట్లు ఇందూదేశము అన్నారు. ఆనాటి జ్ఞానులుంచిన మొదటి పేరైన ఇందూ అను అర్థముగానీ, పదముగానీ ఈనాడు లేదు. దైవ జ్ఞానములో ఆనాటికీ ఈనాటికీ ప్రథమ స్థానములోనే మనమున్నాము. ఇంకనూ కొంత వివరమును తెలుసుకొంటే

ఈ విధముగా గలదు. భారతదేశము ఉత్తరభారతము, దక్షిణభారతమను రెండు భాగములుగా ఉండెడిది. ఉత్తర భారతములోని వారికి సంస్కృత విద్యలో పాండిత్యము ఎక్కువగా ఉండెడిది. దక్షిణభారతములో ఉన్నవారికి చదువుగానీ, సంస్కృత పాండిత్యముగానీ లేకుండెడిది. కానీ ఆధ్యాత్మిక విద్యలో గొప్పగొప్ప జ్ఞానులు దక్షిణదేశములో ఉండెడివారు. దక్షిణదేశము వారివలననే ఈ దేశమునకు ఇందూదేశమని పేరు వచ్చినది. ఇందూ దేశమంటే జ్ఞానుల దేశమని ఆనాటి అర్థము. ఈనాడు ఆ అర్థము ఏమాత్రము లేకుండా పోయినది. దక్షిణ భారతములో ఆనాటి జ్ఞానులు ఆధ్యాత్మికమునకు సంబంధించినట్లుగా, బ్రహ్మవిద్యను అనుసరించి దేవాలయములు నిర్మించారు. అందువలన శాస్త్రపద్ధతిగా ఉన్న దేవాలయములు దక్షిణ భారతదేశములోనే కనిపించును. గాలి గోపురము, ధ్వజస్తంభము, ఏడు ద్వారములు, గర్భగుడి ఇవన్నియూ దక్షిణదేశములోని దేవాలయములలో కనిపించును. ఉత్తరదేశములో ఆత్మజ్ఞానులు లేకుండిరి. కావున అక్కడ దేవాలయములున్నప్పటికీ వాటియందు గాలిగోపురముకానీ, ధ్వజస్తంభముకానీ, ఏడు ద్వారములుకానీ, గర్భగుడికానీ ఉండవు. దక్షిణ దేశములో ఆత్మజ్ఞానులుండెడివారు, ఉత్తరదేశములో విధ్వాంసులుండెడి వారు. కావున ఉత్తరదేశములో సంస్కృతము పాండిత్యము, దక్షిణములో ఆత్మజ్ఞానము ఇప్పటికి గలవు. ఇప్పటికీ శాస్త్రబద్ధమైన పురాతన దేవాలయములు దక్షిణదేశములో గలవు. కాలక్రమేపీ అజ్ఞానము పెరుగుచూ పోవుచున్నది, కావున పురాతన దేవాలయముల అర్థము దక్షిణదేశములో కూడా తెలియకుండా పోయినది. అందువలన ప్రస్తుత కాలములో దక్షిణ దేశములో కూడా తయారగు దేవాలయములు శాస్త్రబద్ధత లేకుండా తయారగుచున్నవి.

www.thraithashakam.org

దక్షిణ దేశములోని ఇందువులు పూర్వము పూర్తి జ్ఞానము కల్గి ఉండుట చేత వారు తయారుచేసిన ఆలయములు జ్ఞాన చిహ్నములై ఉండెడివి. అట్లే వారు చెప్పెడి బోధలు పూర్తి జ్ఞానముతో నిండుకొని ఉండెడివి. అదే విధముగా వారు వ్రాసిన తత్త్వములను పాటలు ఆత్మజ్ఞానముతో మూర్తీభవించి ఉండెడివి. ఇప్పుడు మనము చెప్పుకొను ఈ తత్త్వము పూర్వపు జ్ఞానులచేత వ్రాయబడినది కావున అందులో ఆత్మజ్ఞానముతో కూడుకొన్న వివరములు గలవు. ఇక్కడ "ఏడుకొండలు ఎక్కే మార్గము తెలియని మాకు కంటకములు లేని మార్గము తెలుపమని కోరితిమీ" అని గలదు. పూర్వకాలము జ్ఞానుల ఉద్దేశ్యము ప్రకారము ఏడుకొండలు అనగ మన శరీరములోని ఏడు నాడీకేంద్రములని అర్థము. శరీరములోనే ఆత్మలు నివశిస్తున్నవి. అందువలన శరీరములోనే ఆత్మ జ్ఞానము కలదు. ఆత్మజ్ఞానము ప్రకారము ఏడు నాడీకేంద్రములను ఏడు ద్వారములుగ, ఏడు కొండలుగా పోల్చి చెప్పారు. శరీరములోని ఆరు నాడీకేంద్రములను అతిక్రమించి ఏడవ నాడీకేంద్రమైన మెదడు భాగములో గల ఆత్మను తెలియవచ్చును. శరీరములో మనస్సును నిరోధించి బ్రహ్మయోగము చేయు యోగులకు అది సాధ్యమైన పని. శరీరములోని ఏడు కొండలైన ఏడు నాడీకేంద్రములను ఎక్కే విధము వివరము తెలియని అజ్ఞానులైన మాకు పూర్తి జ్ఞానము కల్గించి సంశయములను ముల్లులులేని మార్గములను తెలుపమని గురువును కోరినట్లు ఈ వాక్యములోని వివరము.

**4) అండ పిండ బ్రహ్మాండము తెలియని మాకు**
**అంతానిండియుండే వానిని తెలుపమని కోరితిమీ**

అండము అనగ గ్రుడ్డు, పిండము అనగ గర్భము. కనిపించెడి కదలుచున్న జీవరాసులలో కొన్ని అండమునుండి పుట్టుచున్నవి, కొన్ని

www.thraithashakam.org

గర్భమునుండి పుట్టుచున్నవి గలవు. భూమి మీద చరించు జీవరాసులను అన్నింటినీ కలిపి అండజములు, పిండజములు అని అంటున్నాము. అంతేకాక కనిపించని జీవరాసులైన సూక్ష్మక్రిములు చలించని జీవరాసులైన చెట్లు ఎన్నో గలవు. మొత్తము విశ్వమంతటినీ లెక్కించి చూచితే ఈ జీవరాసులే కాక ప్రకృతి అయిన మహా భూతములనబడు ఐదు పెద్ద జీవులు కూడా కలరు. చిన్న జీవరాసులైన చలించు జీవరాసులను అండ పిండమని పిలుస్తూ, అతి పెద్దవైన బలమైనవైన ఐదు జీవుళ్ళను బ్రహ్మాండమని పిలుస్తున్నాము. మొత్తము విశ్వమంతటినీ ఒక్కమాటలో అండ, పిండ, బ్రహ్మాండమని అంటున్నాము. చాలామందికి కొన్ని జీవరాసులు తెలుసు, కొన్ని తెలియవు. కొందరికి అండపిండమైన జీవుళ్లు తెలిసిన బ్రహ్మాండమైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి కూడా జీవుళ్ళని తెలియదు. అందువలన 'అండ పిండ బ్రహ్మాండము తెలియని మాకు' అని ఈ వ్యాకములో చెప్పబడియున్నది.

అండ పిండ బ్రహ్మాండమని విశ్వమంతటినీ కలిపి అంటున్నాము. విశ్వమంతా వ్యాపించియుండి, విశ్వమంతటికీ ఆధారమై కనిపించనిది ఒకటున్నది. దానినే దైవము అంటున్నాము. వెతికినా కనిపించనిది కావున దేవుడు అంటున్నాము. అది స్త్రీలింగము కాదు, పురుషలింగము కాదు కావున కనిపించనిదని, కనిపించనివాడని రెండు రకములుగ అంటున్నాము. అండ పిండ బ్రహ్మాండమును సృష్ఠించి పోషించువాడు దేవుడు. దేవుని చేత సృష్ఠింపబడిన అండ పిండ బ్రహ్మాండమే మనకు అర్థము కాలేదు. ఇక దానిని సృష్ఠించిన దేవుడు ఎంతటి వాడో, ఎటువంటివాడో ఎవరికీ తెలియదు. అండ పిండ బ్రహ్మాండము ఏమిటో, దానిని సృష్ఠించిన వాడెటువంటివాడో, కొంత వివరము తెలుపమని గురువును కోరినట్లు పై చరణములో గలదు.

## 5) పుట్టలోని పామును పట్టే విధము తెలియని మాకు పామును పట్టే కట్టు మంత్రము తెలుపమని కోరితిమి

పాము బుసకొట్టే స్వభావము కలది. పాములు పుట్టలలో నివాసముంటాయని అందరికీ తెలుసు. పుట్టలోని పామును పట్టాలంటే కొంత నేర్పరితనము కావాలి. ఆ నేర్చుకోవడము అంతకు ముందు నేర్చుకొన్న వాని దగ్గరనుండే నేర్చుకోవాలి. పామును పట్టుకోవాలంటే దానిని కట్టడి చేయు మంత్రమును తెలుసుకోవలసియున్నది. ఆ మంత్రమును నేర్చుకొనుటకు ఒక మంత్రగానిని ఆశ్రయించవలసిందే. ఇదే విధానము ఆత్మజ్ఞానములో కూడా కలదు. అదేమనగా పుట్ట అనగ శరీరమని తెలియవలెను. పుట్టలోని పాము అనగ శరీరములోని ఆత్మ అని తెలియవలెను. శరీరమను పుట్టలో రెండు రకముల పాములు గలవు. ఒకటి చలాకీగ వుండి పుట్టంతయూ తిరుగుచూ బుసకొట్టుపాము, రెండవది మజ్జుగ ఒక చోటనేవుంటూ బుసకొట్టని పాము. రెండు పాములను రెండు ఆత్మలని అనవచ్చును. ఒకటి చురుకుతనము కల్గి కదలుచున్న బుసకొట్టు నాగుపాము. రెండవది చురుకుతనము లేకుండా, కదలకుండా, బుసకొట్టకుండా ఉండే పూడుపాము. బుసకొట్టే పాము చైతన్యముగల ఆత్మ అనియూ, బుసకొట్టని పామే చైతన్యములేని జీవాత్మ అనియూ చెప్పవచ్చును. బయట గల మట్టిపుట్టలో ఒకపాము ఉండవచ్చును, కాని శరీరమను పుట్టలో ఎప్పటికీ రెండుపాములే ఉండును. మట్టి పుట్టకు రంధ్రములెన్ని అయినా ఉండవచ్చును, కానీ శరీరమను పుట్టకు తొమ్మిది రంధ్రములు మాత్రమే ఉండును. ఈ విధముగా బయటి మట్టి పుట్టకు, శరీరమను పుట్టకు తేడాలు గలవు.

www.thraithashakam.org

ఆధ్యాత్మిక విద్యరీత్యా ఇక్కడ విశేషమేమిటంటే రెండవదైన బుస కొట్టని పూడుపాము మొదటిదైన బుసకొట్టు నాగుపామును అదిమి పట్టాలి. అనగా కదలని పాము కదిలెడి పామును జయించాలి అని అనుకొందాము. పూడుపాములమైన మనము అనగా శరీరములోనే నివశించు జీవాత్మలము. జీవాత్మతోపాటు శరీరములోనే ఉండి శ్వాస అను శబ్దముతో బుసకొట్టు ఆత్మను తెలుసుకోవాలి. కదలికలేని జీవాత్మ కదలికయున్న ఆత్మను జ్ఞానము అను మంత్రోపదేశము ద్వారా తెలియవచ్చును. జ్ఞానమును తెలియజేయు గురువు దగ్గర ఆత్మను తెలియుటకు అడిగిన విధానమే పై చరణములోని పామును పట్టే విధము తెలియని మాకు 'పామును పట్టే కట్టు మంత్రము తెలుపమని కోరితిమీ' అన్నారు.

## 10. పద్య తత్త్వము

**ఆదిద్వయంబు వృక్షంబు**
**మీదట రెండక్షరములు మేధినిచరితా**
**ఆదియు అంత్యము కూడిన**
**వేదాంతం దీని తెలియు వేద వేద్యుల్**

**వివరము :-** మన శరీరములో ప్రతి ఒక్కరికి శ్వాస ఆడుచున్నది. శ్వాసను బట్టి ప్రాణమున్నదనీ, లేదనీ చెప్పవచ్చును. కావున శ్వాసను ప్రాణము అన్నారు. అనగా గాలి అని అర్థము. మన శరీరములో ఐదు రకముల గాలులు గలవు. అవి వరుసగ వ్యాన, ఉదాన, సమాన, ప్రాణ, అపాణ వాయువులంటాము. వాటినే పంచప్రాణములని కూడా అనుచున్నాము.

www.thraithashakam.org

వీటిలో ప్రాణవాయువు శరీరములో ఊపిరితిత్తులనుండి ముక్కు రంధ్రముల వరకు వ్యాపించివున్నది. ప్రాణవాయువు రెండు ఊపిరితిత్తుల నుండి ముక్కు రంధ్రముల ద్వారా బయటికి లోపలికి చలించుచున్నది. మనిషి పుట్టుకలో బయటినుండి శ్వాస లోపలికి ప్రవేశిస్తున్నది, చావులో లోపలి నుండి బయటికి వెళ్లిపోవుచున్నది. శ్వాస బయటినుండి పోయినా, లోపలి నుండి బయటికి వచ్చినా రెండుగానే బయలుదేరుచున్నది. రెండు ఊపిరితిత్తులనుండి బయలుదేరిన శ్వాస రెండు చీలికలుగానే బయటికి వస్తున్నది. కావున శ్వాసను వృక్షముగా పోల్చి, మొదలులో రెండుకొమ్మలు పుట్టిన వృక్షమని అన్నారు. దానినే 'ఆది ద్వయంబు వృక్షము' అన్నారు. శ్వాస లోపలికి బయటికి చలించడములో రెండు శబ్దములు పుట్టుచున్నవి. అవి సో, హం అను శబ్దములు, శ్వాస వలన కలుగు శబ్దములు కావున మొదట రెండక్షరములని అన్నారు. లోపలికి పోవునపుడు ఒక శబ్దము, బయటికి వచ్చునపుడొక శబ్దము పుట్టుచూ ప్రత్యేకత కల్గియున్నవి. లోపలికి పోవు "సో" శబ్దమును, బయటికి వచ్చు "హం" శబ్దములను రెండిటినీ కలిపి చూస్తే **"ఓం"** అను శబ్దము పుట్టుచున్నది. మొదటిదైన సో శబ్దములో 'ఓ' శబ్దము చివరిగ వినిపిస్తున్నది. అలాగే రెండవదైన హం శబ్దములో 'మ్' శబ్దము వినిపిస్తున్నది. రెండిటినీ కలిపితే 'ఓం' అను శబ్దము తయారగుచున్నది. కావున 'ఆదియు అంత్యము కూడిన' అని మూడవ చరణములో అన్నారు. ప్రతి జీవరాసి శరీరములోనూ, శ్వాసలో 'ఓమ్' అను శబ్దము ఇమిడి ఉన్నది. ఆధ్యాత్మికములో అత్యంత ప్రాముఖ్యమైనది కావున వేద వేద్యులకు వేదాంతమని చెప్పారు.

www.thraithashakam.org

# 11. తత్త్వము

శ్రీ గురు రాయుడు మాయమర్మము తెలిపినాడే
మాయలో ఉంటూ లేనివాడు కమ్మన్నాడే

**1) ఆరును ద్రుంచి ఆరును నరకమన్నాడే ॥ శ్రీ గురు ॥**
**ఆరును ఆరును చేరక ఉండమన్నాడే**
**2) తొమ్మిది వాకిళ్ళ కొంపకు ఎందుండి వస్తివన్నాడే ॥ శ్రీ గురు ॥**
**ఎందు తిరిగినా ముందుచోటుకే పొమ్మన్నాడే**
**3) ఆరు శిఖరములపైన వెయ్యికాళ్ళ మంటపమన్నాడే ॥ శ్రీ గురు ॥**
**ఆరు శిఖరముల ఎక్కి ఎగచూడమన్నాడే**
**4) మూడు నదులు కలియుచోటు తెలియమన్నాడే ॥ శ్రీ గురు ॥**
**మూటిలోయుండే మూల పురుషుని చూడమన్నాడే**

**వివరము :-** విశ్వమంతా వ్యాపించియున్నవి రెండే రెండు అవియే ప్రకృతి, పురుషుడు అని అంటాము. ప్రకృతికి మారు పేరు 'మాయ' అని కూడా కలదు. అలాగే పురుషున్ని 'దేవుడు' అని కూడా అనుచున్నాము. దేవుడు పుట్టించినదే మాయ. దేవుని ఆజ్ఞ ప్రకారము నడుచుకొనునదే మాయ. తనకు వ్యతిరేఖముగా వ్యవహరించమని దేవుడు మాయను ఆజ్ఞాపించాడు. కావున మాయ ఎప్పటికీ దైవమార్గమునకు వ్యతిరేఖమే. ఒక విధానములో మాయను భార్య అని, దేవున్ని భర్త అని చెప్పవచ్చును. భర్త అయిన దేవునికి తన భార్య అయిన మాయ యొక్క వివరమంతయు తెలియును. కావున మాయ వివరము తెలియజెప్పవలయునంటే అది దేవునికొక్కనికే సాధ్యము. దేవుడు తన శక్తిలో కొంత భాగమును భూమి మీద మనిషిగ తన ప్రతినిధిగా పుట్టించును. అతనినే 'గురువు' అంటున్నాము. భూమిమీద దేవుని అవతారము తప్ప ఎవరూ గురువగుటకు అర్హులు కారు. దేవుని

అంశ అయిన గురువు తనను విశ్వసించిన వారికి మాయ యొక్క మర్మము తెలుపును. అలా మాయ యొక్క మర్మము తెలిసినవారు 'తామరాకు నీటిలో ఉన్నప్పటికీ తేమ అంటనట్లు' మాయలో ఉన్నప్పటికీ కర్మ అంటని వారైవుందురు. అందువలన ఈ తత్త్వములో మొదటనే 'శ్రీగురు రాయుడు మాయమర్మము తెలిసినాడే మాయలో ఉంటూ లేనివాడు కమ్మన్నాడే' అన్నారు.

**1) ఆరును ద్రుంచి ఆరును నరకమన్నాడే**
**ఆరును ఆరును చేరక ఉండమన్నాడే ॥ శ్రీ గురు ॥**

మన శరీరములో దేవుడు నివశిస్తున్నాడు కావున శరీరమును దేవాలయము అన్నాము. దేవాలయమునందు గర్భగుడిలో భగవంతుని ప్రతిమ ఉన్నప్పటికీ, దాని చుట్టూ వికృతాకారములో ఉన్న సింహ తలాటము లేక ప్రభావలి అనునది తప్పకయుండును. అదే విధముగనే శరీరములో దేవుడున్నప్పటికీ మాయ కూడా కలదు. దేవుడు ఆత్మరూపములో ఉంటూ శరీరమును నడుపు శక్తిగా, శరీరమంతా వ్యాపించి ఉండగా, మాయ గుణముల రూపముతో తలయందు గలదు. మనిషి తలయందు గల గుణములను మాయజనితములని లేక మాయయుక్తములని చెప్పవచ్చును. అందువలన భగవద్గీతలో భగవంతుడైన శ్రీకృష్ణుడు **"గుణమయీ మమ మాయా"** అన్నాడు. దీని ప్రకారము మాయ ప్రతి శరీరములోనూ గుణముల రూపములో ఉన్నదని తెలియుచున్నది. గుణములు లేనివాడు ఎవడూ లేడు. కావున మాయలో లేనివాడు ఎవడూ లేడనియే చెప్పవచ్చును. మనిషి తలలోని మాయ యొక్క స్థానము ఎక్కడున్నదని పరిశీలించి చూచితే, తలలో సూక్ష్మరూపముగ ఉన్న నాలుగు చక్రములలో క్రింది చక్రమైన గుణచక్రములో సాత్త్విక, రాజస, తామసమను మూడు భాగములు గలవు. ఆ భాగములలో ఒక్కొక్క భాగమునందు ఆరు ఒక రకము, ఆరు మరొక

www.thraithashakam.org

రకము మొత్తము పంద్రెండు గుణములు గలవు. ఈ రెండు రకములైన గుణములను జయించగలిగితే మాయను జయించినట్లగును. అందువలన పై చరణములో 'ఆరును ద్రుంచి ఆరును నరకమన్నాడే' అని వర్ణించి చెప్పారు.

మాయ గుణమయమై యుండినప్పటికీ ఆరు ఒక రకము, ఆరు మరొక రకమైన గుణములుగ ఉన్నదని చెప్పుకొన్నాము. ఆరు మరియు ఆరు వివరమును పరిశీలించి చూచితే ఆరు చెడు గుణములు, ఆరు మంచి గుణములుగా ఉన్నవి. ఆరు చెడు గుణములు వరుసగ 1) కామ (ఆశ) 2) క్రోధ (కోపము) 3) లోభ (పిసినారితనము) 4) మోహ (నాది, నా వారు) 5) మద ( గర్వము) 6) మత్సర (అసూయ). ఈ ఆరు గుణములనే మనిషికి శత్రువులాంటివని 'అరిషట్ వర్గము' అన్నారు. అలాగే మనిషికి మిత్రునిలాంటి మంచి గుణములు కూడా ఆరు గలవు. అవి వరుసగా 1) దాన 2) దయ 3) ఔదార్య 4) వైరాగ్య 5) వినయ 6) ప్రేమ అనునవి. ఈ గుణములను బట్టి మనిషి సమాజములో మంచివాడని లేక చెడ్డవాడని లెక్కించబడుచున్నాడు. ఈ గుణముల వలననే పాపము పుణ్యములను కర్మలు కలుగుచున్నవి. మాయ యొక్క రెండు రకముల గుణములు జీవునకు కర్మలను అంటగట్టి జన్మను కలుగజేయునవే. కనుక కర్మలను బంధనములు అన్నారు. మాయకు వ్యతిరేఖము దైవము. మాయయొక్క గుణములకు వ్యతిరేఖము దైవము యొక్క జ్ఞానము. గుణములచేత తయారగు కర్మలకు వ్యతిరేఖము జ్ఞానము వలన తయారైన జ్ఞానాగ్ని. అందువలన మనషి దైవజ్ఞానమును తెలిసి జ్ఞానాగ్నిని సంపాదించుకొంటే మాయ గుణముల ప్రభావమైన కర్మ కాలిపోవునని తెలుపుచూ ఆరును, ఆరును చేరకయుండమన్నాడని వ్రాశారు.

www.thraithashakam.org

**2. తొమ్మిది వాకిళ్ళ కొంపకు ఎందుండి వస్తివన్నాడే**
**ఎందుతిరిగినా ముందు చోటికే పొమ్మన్నాడే**

మనము నివశించుదానిని ఇల్లు లేక గృహము అంటాము. మనిషి తన ఆర్థిక స్థోమతను బట్టి పూరిగుడిసె నుండి పెద్ద మేడలో వరకు నివశిస్తున్నాడు. మనిషి ఎటువంటి ఇంటిలో నివశించినప్పటికీ ఆ ఇంటికి ఒక ద్వారము (వాకిలి) నుండి అనేక ద్వారముల వరకు ఉండవచ్చును. చిన్న గుడిసెకైతే ఒక వాకిలి ఉంటుంది. పెద్ద మేడకైతే ఇరువై లేక ముప్పై వరకు ఎన్నైనా ఉండవచ్చును. గృహములన్నియూ వానివాని కర్మానుసారము ఉండునని చెప్పవచ్చును. ఆధ్యాత్మిక విద్యలో ఆత్మల వివరమే చెప్పబడు చున్నది, కావున ఇక్కడ జీవాత్మ వివరమునే మనము ప్రస్తావించుకోవాలి.

మనిషికి గృహమెలా గలదో జీవాత్మకు కూడా గృహము కలదు. అదియే శరీర గృహము. మనుషులు నిర్మించుకొన్నవి బయటికి మిద్దెలు మేడలైతే, దేవుడు నిర్మించి ఇచ్చిన గృహము శరీరము. బయటి ఇంటికి వాకిళ్ళు ఎన్నైనా మనము పెట్టుకోవచ్చును గానీ, దేవుడు ఇచ్చిన శరీర గృహమునకు కేవలము తొమ్మిది వాకిళ్ళు మాత్రము తప్పక ఉండును. జీవాత్మ శరీరమను గృహములో కొంతకాలము నివాసము చేసి ఆ శరీర గృహమును వదలి పోవడము కూడా జరుగుచున్నది. మనము నిర్మించుకొన్న బయటి గృహము కొంతకాలమునకు శిథిలమై నివాస యోగ్యముకానట్లు శరీరగృహము కూడా శిథిలమై పోవుచున్నది. జీవాత్మ శిథిలమైన శరీరమును వదలి మరొక క్రొత్త శరీర గృహములో చేరుచున్నాడు. మొట్టమొదట జీవాత్మ పరమాత్మ నుండి వచ్చినదే. అలా వచ్చిన జీవాత్మ నివశించుటకు శరీరము తప్పనిసరి అయినది. మొదట పరమాత్మనుండి వచ్చిన జీవాత్మ తర్వాత శరీర గృహములు మారుచూ భూమి మీదనే ఉండిపోయినది. ఈ

తత్త్వములో జీవాత్మకు కావలసిన జ్ఞానమును చెప్పుచూ 'తొమ్మిది వాకిళ్ళకొంపకు ఎందుండి వస్తివని' ప్రశ్నించారు. తర్వాత ఎన్ని శరీరములు మారినా మొదటి పరమాత్మలోనికే పొమ్మని చెప్పుచూ 'ఎందుతిరిగిన ముందు చోటికే పొమ్మన్నాడు.' గురువు శిష్యునకు బోధించవలసినది ఆత్మజ్ఞానము కావున జీవాత్మకు తన మొదటి స్థానమును జ్ఞాపకము చేసి తిరిగి అక్కడికే పొమ్మనే హితము ఈ చరణములో చెప్పారు.

**3. ఆరు శిఖరములపైన వెయ్యికాళ్ళ మంటపమన్నాడే**
**ఆరు శిఖరములు ఎక్కి ఎగచూడమన్నాడే**

శిఖరము అనగ కొండ అగ్ర భాగమని అర్థము. ఆరు కొండలు పూర్తి ఎక్కిన తర్వాత పైన ఏడవ కొండ మీద వెయ్యికాళ్ళమంటపమున్నదట. వేయిస్థంభాల మంటపములో దేవుడు తప్ప ఎవరుంటారు. కావున దేవున్ని చూడాలంటే ఆరు శిఖరములను ఎక్కి పైన ఉన్న దేవున్ని ఎగ చూడమన్నారు. ఇదే విషయమును తెలియజేయుటకు 'ఏడుకొండల మీద వెంకటేశ్వరుడున్నాడని' చెప్పుచుందురు. కొండల మీద దేవుడుంటే ఏడుకొండలేమిటి ఏకంగా ఎనభై కొండలైనా ఎక్కి చూడవచ్చును. ఏడు కొండలు ఎక్కిన, ఎనభై కొండలు ఎక్కినా అక్కడ కనిపించేది శిలా ప్రతిమ తప్ప ఏమీ ఉండదు. అది ప్రతిరూపమైన ప్రతిమే తప్ప దేవుడు కాదు.

దేవుడు ఆత్మరూపములో ఉంటాడు కానీ ప్రకృతి రూపమైన రాళ్ళు, నీళ్ళరూపములో ఉండడని పెద్దలంటుంటారు. అందువలన 'చిల్లరరాళ్ళకు మ్రొక్కుచుయుంటె చిత్తము చెడునుర' అన్నారు. అట్లయితే ఈ తత్త్వములో ఏడు శిఖరములు ఎక్కి ఎగచూడమని ఎందుకన్నారని కొందరికి ప్రశ్న రావచ్చును. దానికి సమాధానము ఏమనగా! మన శరీరమే దేవాలయము అందులోని ఆత్మే దేవుడని కొందరు పెద్దలు అన్నారు కదా! దాని ప్రకారము

www.thraithashakam.org

శరీరములోని ఆలయ అమరికను గురించి చెప్పినదే ఈ తత్త్వము చరణము. మన శరీరములో మూడు లక్షల యాభైవేల నాడులు గలవని ప్రతీతి. అందులో అన్నిటికంటే పెద్దవి మూడని, అవియే ఇడ, పింగళ, సుషుమ్ననాడు లని వాటినే సూర్య,చంద్ర, బ్రహ్మనాడులని అంటున్నాము. వాటిలో ముఖ్యమైనది సుషుమ్న అనబడు బ్రహ్మనాడి. ఈ బ్రహ్మనాడి శరీరములోని వెన్నెముక మధ్య భాగములో గుదస్థానము మొదలుకొని కపాల స్థానము వరకు వ్యాపించివున్నది. అట్లు వ్యాపించివున్న బ్రహ్మనాడి ఏడు నాడీ కేంద్రములుగ విభజింపబడి ఉన్నది. ఆరు కేంద్రముల పైనగల ఏడవ నాడీకేంద్రము ఆత్మకు స్థానమై ఉన్నది. బ్రహ్మనాడిలో ఏడవ నాడీకేంద్రమైన మెదడులో ఆత్మ నివాస ముండుట వలన ఆత్మను దైవముగా లెక్కించుటవలన ఆరు నాడీ కేంద్రములను ఆరు శిఖరములుగ పోల్చి ఏడవ దానిమీదికి ఎగచూడమన్నారు. శరీరములోని ఆత్మను తెలుసుకొనుటకు చేసిన ప్రయత్నమే ఈ తత్త్వము యొక్క ఉద్దేశము. కావున శరీరములోని నాడీకేంద్రములను కొండలుగ పోల్చి ఏడవకొండ మీద దేవుడున్నాడని 'ఏడవ నాడీ కేంద్రమునకు దృష్టిమరలునట్లు' చేశారు.

**4. మూడు నదులు కలియుచోటు తెలియమన్నాడే**
**మూటిలోయుండే మూల పురుషుని చూడమన్నాడే**

ఇంతకు ముందు శరీరములోని మూడునాడుల గురించి చెప్పు కొన్నాము. ఈ మూడునాడులు విడివిడిగ ఉండి క్రింది వరకు వ్యాపించి ఉన్నప్పటికీ ఆ మూడు కలియుచోటు ఒకటి కలదు. అదియే మెదడు స్థానము. దానిని ఏడవ పెద్దనాడీ కేంద్రమని కూడా చెప్పుకొన్నాము. ఈ కేంద్రములో మూడునాడులు కలియుచున్నవి. ఈ ఏడవ కేంద్రములోనే ఆత్మ నివాసమని చెప్పుకొన్నాము. ఆత్మయే శరీరమంతటికీ, అన్ని నాడీ

కేంద్రములకు మూలాధారమైవున్నది. ఈ విషయమును వివరించుటకు మూడునాడులను మూడునదులుగా పోల్చి మూడు నదులు కలియుచోటు తెలియమన్నారు. మనలోని మనస్సును బాహ్యాచింతలయందు లగ్నము చేయక మన తలయందు త్రికూట స్థానములో ధ్యాసనుంచితే అక్కడున్న ఆత్మ తెలియునని పెద్దల ఉద్దేశము. కావున 'మూటిలోవుండే మూల పురుషుని తెలియమన్నారు.' శరీరములో మూడునాడులు కలియు త్రికూట స్థానమున మనస్సు నిలుపనివాడు, బాహ్యముగ ఆత్మను వెతుకువాడు ఎప్పటికీ బ్రహ్మవేత్త కాలేడని నాల్గవ చరణములోని భావము.

## 12. తత్త్వము

**గుట్టు తెలిసి మసులుకొనరే సుజ్ఞానులార బట్టబయలు దీని**
**భావమెల్లను గుట్టు తెలిసి నడుచుకొనరే**

**1) గండుపిల్లి లోకమెల్ల పారజూచి ఏలగాను,**
**కొండ ఎలుక లొక్క రెండు కొలువు జేసేరా ॥ గుట్టు॥**

**2) అండబాయక చిలుకలైదు అడవి గాచుచుండగాను,**
**పండు కోతులొక్క రెండు ప్రహరి తిరిగేరా ॥ గుట్టు॥**

**3) ముట్టు తప్పి గొడ్డురాలు మహిళకొక్క కొడుకు పుట్టి**
**గొప్పకొండలేడు మ్రింగి గురకపెట్టెరా ॥ గుట్టు॥**

**4) గుట్టు చప్పడనక నొక్కడు ఉరికి మింటి కెగయగాను,**
**కుప్పిగంతులేసి పాము కరచి మ్రింగేరా ॥ గుట్టు॥**

**5) భువిని నోరులేని మిడత పులిని మ్రింగేను,**
**ఆ వార్త తెలిసి మేక యొకటి పకపక నవ్వేరా ॥ గుట్టు॥**

www.thraithashakam.org

**6) ఈ వివరము అరసి చూడ అలవిగాదు ఎవరికైనను,**
**తెలివిగల యాగంటి గురుడు తానె తెలియురా ॥ గుట్టు॥**

ఇక్కడ ఆరవ చరణములో ఈ తత్త్వ వివరము తెలుసుకొనుటకు ఎవరికీ అలవిగాదు. తెలివిగల యాగంటి గురుడు తానే తెలియురా అన్నారు. ఇపుడు ఈ తత్త్వ వివరమును తెలిసి మేము వ్రాయాలంటే యాగంటి గురుడుగ మారిపోక తప్పదు. అలా మారి ఆయనకు ఏ వివరము తెలిసిందో మనము తెలుసుకొందాము.

**1) గండుపిల్లి లోకమెల్ల పారజూచి ఏలగాను,**
**కొండ ఎలుక లొక్క రెండు కొలువు జేసేరా ॥ గుట్టు॥**

మన శరీరములో కదలికశక్తి ఉన్నది. ఆ శక్తిని చైతన్యశక్తి అంటున్నాము. ఆ శక్తి శరీరములో ఎక్కడున్నదో ఎట్లున్నదో ఎవరికి తెలియదు. దానిని ఎవరూ చూడలేదు. మనిషి శరీర బరువుకంటే ఎక్కువున్న బరువును కూడా శరీరములోని శక్తి కదలించుచున్నది. బయటి వస్తువులను కదలించు శక్తి మన శరీరములోని శ్వాసను కూడా ఆడించుచున్నది. చైతన్యమును నమ్మలేనివారు కూడా శ్వాస కదలిక చూచి నమ్మవలసి వస్తున్నది. కనిపించని చైతన్యమును ఒక పేరు పెట్టి పిలువడము జరిగినది. ఆ పేరే **"ఆత్మ"**. ఆత్మ ఒక్కచోట కేంద్రముగా ఉండి శరీరమునంతటినీ తన చైతన్యము చేత నడుపుచున్నది. కనిపించని ఆత్మ శరీరములో ఉందా లేదా అని చూచుటకు శ్వాసను బట్టి చూడవలసిందే. శ్వాస ముక్కు రంధ్రములలో ఆడుచువుంటే లోపల ఆత్మ ఉందనీ, శ్వాస ఆడకపోతే లోపల ఆత్మలేదని తెలియగలుగుచున్నాము. ఆకాశములోని సూర్యుడు తన కిరణముల చేత లోకమునంతటినీ ప్రకాశింపజేయునట్లు,

శరీరములోని బ్రహ్మనాడి ఏడవ కేంద్రములోవున్న ఆత్మ తన చైతన్యము చేత శరీరమునంతటినీ ప్రకాశింప జేయుచున్నది. శరీరములో ఆత్మ ప్రకాశమున్నదా లేదా అనుటకు బయటకు కనిపించు శ్వాసే ఆధారము. దీనినిబట్టి రాజువలె ఆత్మ శరీర సామ్రాజ్యమును ఏలుచున్నప్పటికీ ఆత్మ అనెడి రాజు కనిపించలేదు. కానీ ఆత్మకు ఎన్నోరెట్లు తక్కువయున్న, ఆత్మచేత కదలుచున్న రెండు శ్వాసలే శరీరమునకు ప్రకాశమనుకొన్నట్లు భ్రమింపజేయుచున్నవి. ఈ విధముగ స్పర్శకు కనిపించే శ్వాసే శరీరమునకు జీవనాధారమని కొందరనుకొని, దానిని మించినది లేదనుకొనుటయే జ్ఞానమనుకొని, లోపలగల ఆత్మను మరచి శ్వాసమీదే ధ్యాస పెట్టు కొమ్మంటున్నారు. ఆత్మ మీద ధ్యాస పెట్టక శ్వాస మీద ధ్యాస పెట్టితే 'గండుపిల్లిని వదలి చిట్టెలకలను నమ్ము కొన్నట్లుంటుంది.'

మన శరీరములోని ఆత్మ గండుపిల్లి లాంటిది. ఆత్మ బలమును అంచనా వేయలేము, కనుక ఆత్మను ఈ తత్త్వములో గండుపిల్లితో సమానముగా పోల్చుచున్నాము. ఆత్మ తన చైతన్యముచేత శరీరమంతా వ్యాపించియున్నది. కావున ఇక్కడ 'గండుపిల్లి లోకమెల్ల పారచూచి ఏలెరా' అన్నారు. లోకమంటే శరీరమని అర్థము చేసుకోవలెను. లోపలున్న రాజు తెలియదుగానీ బయటున్న భటులు మాత్రము తెలుసునన్నట్లు లోపలగల ఆత్మ తెలియదుగానీ, బయటున్న శ్వాసలు మాత్రము తెలియుచున్నవి. అదే విధముగ లోపలున్న బలమైన గండుపిల్లిలాంటి ఆత్మ తెలియదుగాని బలములేని చిట్టెలుకలలాంటి రెండు శ్వాసలు తెలియుచున్నవి. అందువలన అందరికీ తెలిసినట్లు 'రెండు కొండ ఎలుకలు కొలువు చేసెరా' అన్నారు. నిజమైన కొలువు లోపల పిల్లిదైనా, కనిపించెడి కొలువు ఎలుకలదే అన్నట్లున్నది కదా! అందువలన గండుపిల్లి విషయము తెలియని కొందరు

మా ధ్యాస శ్వాసమీదే అని రెండెలుకలను పట్టుకొని ఊగులాడుచున్నారు. గండు పిల్లి సింహాసనము తల మధ్య భాగములో ఉన్న ఏడవ నాడీకేంద్రమైతే, చిట్టెలుకలు రెండు ఊపిరితిత్తుల వరకు లోపలికి పోయి వచ్చుచున్నవి. ఏది ఏమైనా గండుపిల్లి దయాదాక్షిణ్యముతోనే రెండు ఎలుకలు బ్రతుకు చున్నవి. పిల్లి తన స్థానము వదలి వచ్చినదంటే రెండు ఎలుకలను నోటకరుచుకొని పోతుంది. ఆత్మ బయటికి వస్తే శ్వాసలుండవని అర్థము.

మీరు బాగా అర్థము చేసుకొనుటకు మరొకమారు చెప్పడమేమంటే పిల్లి అనగ ఆత్మ అని, లోకమెల్ల అనగ శరీరమంతా అని అర్థము, పారజూచి ఏలడము అనగ గోర్లు వెంట్రుకల వరకు తన శక్తిని వ్యాపింపజేయడమని అర్థము. కొండ ఎలుకలు అనగ శ్వాసలు, ఒక రెండు అనగా రెండు ఒక్కటిగా బయటికి కలసి వస్తున్నవి, కలిసి లోపలికి పోవుచున్నవని అర్థము. కొలువు చేసేరా అనగా శ్వాసలే శరీరమునంతటికీ ఆధారమన్నట్లు కనిపిస్తున్నవని అర్థము. ఈ విధముగ అర్థము చేసుకొంటే ఈ మొదటి చరణములోని భావమంతా బట్టబయలే అని చెప్పారు.

**2) అండబాయక చిలుకలైదు అడవి గాచుచుండగాను,**
**పండు కోతులొక్క రెండు ప్రహరి తిరిగేరా ॥ గుట్టు॥**

శరీర నిర్మాణము ప్రకృతియైన పంచభూతముల చేత నిర్మాణమై ఉన్నది. శరీరము పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు పదార్థముల చేత తయారైనది. శరీరమంతా ఐదు పదార్థములే నిండివున్నవి. ఆత్మ తల మధ్య భాగములో ఉండి ఈ ఐదు భాగములంతటికీ తన శక్తిని ప్రసారము చేయుచున్నది. దీనినిబట్టి పంచభూతముల రాజ్యములో ఆత్మ రాజుగా ఉన్నాడని తెలియుచున్నది. ఇంటికి కాపలా

www.thraithashakam.org

కాయమని ఇంటి యజమాని చెప్పితే ఇంటిలోని గుమస్తాలు యజమాని చెప్పిన పని చేసినట్లు ఆత్మ చెప్పిన పని పంచభూతములు చేయుచున్నవి. పంచభూతములు ఒక్కొక్కటి ఐదు భాగములుగ విభజించబడి మొత్తం ఇరువది ఐదు భాగములుగ విస్తరించివున్నవి. ఆత్మ అను యజమానిని అనుసరించి పంచభూతముల నిర్మితమైన అవయవములు పని చేయుచున్నవి. ఈ విధానమును రెండవ చరణములో చెప్పుచూ 'పంచభూతములను ఐదు చిలకలుగ' వర్ణించారు. పంచభూతములన్నీ ఒకచోట కలిసివున్నాయి కనుక అండబాయక అన్నారు. పంచభూతములు కనిపించెడి పది అవయవములుగా, కనిపించని పదిహేను అవయవములుగ శరీరమంతా వ్యాపించివున్నవి. కావున 'చిలుకలైదు శరీరమను అడవిని కాచుచున్నవని' చెప్పారు.

శరీరమును అడవిగా పోల్చుకొంటే దానికి ప్రహరి గోడలాంటిది చర్మము. చర్మము దాటి శరీరముండదు. చర్మము లోపలనే శరీరమంతా ఉండును. గోర్లు వెంట్రుకలు కూడ చర్మములోని భాగములే అని గుర్తుంచుకోవలెను. శరీరమను అడవిలో ఇరువదైదు అవయవములనబడు జంతువులు కలవని చెప్పుకోవచ్చును. వాటిలో ఎప్పుడూ చలనము కలిగినవి కోతులు. అందులోను తిరిగే దానిలో బాగా అలవాటుపడినవని అర్థమగుటకు పండుకోతులని కూడా చెప్పారు. ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాస అను రెండు కోతులు శరీరము బయటికి కూడా వస్తున్నవి. కావున ప్రహరి దాటిపోయి తిరిగి వస్తున్నవని చెప్పవచ్చును. రెండు ముక్కురంధ్రముల శ్వాసలను రెండు కోతులుగ లెక్కించి చూచితే శరీరమను అడవినుండి చర్మమను ప్రహరి దాటిపోయి తిరిగి వచ్చుచున్నవి. అందువలన 'పండు కోతులొక్క రెండు ప్రహరి తిరిగేరా' అన్నారు.

అండబాయని ఐదు చిలకలనగ ఒక్క చోట కలసియున్న పంచ భూతములని, శరీరమును అడవియని, ఒక్క రెండు అనగ ఒక్క శ్వాసే రెండు భాగములుగ ఉన్నదని, పండుకోతులనగ తిరుగుటలో పండిన రెండు రకముల శ్వాసలని, ప్రహరి అనగ శరీరమును చుట్టియున్న చర్మమని అర్థము చేసుకొన్నపుడు రెండవ చరణములోని రహస్యము సులభముగా అర్థము కాగలదు. చూచుటకు విచిత్రముగా చిలకలు, కోతులు, అడవి అని వ్రాసిన ఈ వాక్యములో ఎంతో జ్ఞానము ఇమిడి ఉన్నది.

**3) ముట్టు తప్పి గొడ్డురాలు మహిళకొక్క కొడుకు పుట్టి**
**గొప్పకొండలేడు మ్రింగి గురకపెట్టెరా ॥ గుట్టు॥**

మానవులలో పూర్వము వెయ్యింటికొకడు అదియూ అరుదుగ జ్ఞానము మీద ఆసక్తి కల్గియుండెడివారట. నేటి కాలములో లక్షమందిలో ఒక్కనికి జ్ఞానము మీద ఆసక్తియుండడము అరుదే అని చెప్పవచ్చును. రెండు మూడు లక్షలకు ఒకడు జ్ఞానము మీద ఆసక్తియున్నవాడు దొరికినప్పటికీ వాడు చివరి వరకు జ్ఞానము తెలుసుకుంటాడను నమ్మకము లేదు. దీనినిబట్టి చూస్తే కడవరకు జ్ఞానాసక్తి కల్గియుండువాడు కొన్ని లక్షలకు ఒకడు దొరుకునని తెలియుచున్నది. బహుశ పదిలక్షలకు ఒకడు దొరికితే పదిలక్షలమంది అజ్ఞానులు ఉంటారన్నమాట. అంతమందిలో జ్ఞాని అయినవాడు కర్మయోగము, బ్రహ్మయోగము అను రెండు యోగములలో ఏ యోగమునైనా అనుసరించవచ్చును. ఒకవేళ బ్రహ్మ యోగమును అనుసరించాడని అనుకొందాము. అతడు బ్రహ్మయోగి అగును. ఇంతవరకున్న వివరమును పై చరణములో ఏ విధముగ వివరించారో చూద్దాము. గొడ్డురాలు అనగ పిల్లలు పుట్టనిదని అందరికీ తెలియును. గొడ్డురాలుకు పిల్లలు పుట్టకున్నా ముట్టు అనునది ప్రతి నెల ఉండనే

ఉండును. అజ్ఞానికి జ్ఞానము కలుగుట దుర్లభము, పది లక్షలమందికి కూడా ఒక్కడు దొరుకుట అరుదు అనుకొన్నాము కదా! అజ్ఞానిని గొడ్డురాలుగ పోల్చి వారికి జ్ఞానము అను సంతతి కలుగదు అన్నారు. సంతతి కలగాలంటే వారిలో జ్ఞానమనే బీజము పడాలి. జ్ఞానమనేది టీవిలలోనూ, రేడియోలలోనూ ఎక్కడైనా గురువులవద్ద విన్నప్పటికీ ఆసక్తి లేనివారికి అది ఫలించదు, అనగా బుర్రకెక్కదు. ఎంతోమంది అజ్ఞానులలో ఒక్కడైన జ్ఞానుల సాంగత్యములో జ్ఞానమును విని, దానిమీద ఆసక్తి పెంచుకొంటే వానికి జ్ఞానబీజము పడినట్లే. అటువంటివాడు కొంత కాలమునకు యోగి కాగలడు. అజ్ఞానమనే గొడ్డుతనము కల్గి యోగమనే సంతతి లేనివానికి జ్ఞానబీజము పడినపుడు అజ్ఞానము అను ముట్టు నిలిచిపోవును. జ్ఞాన బీజము పడినవానికి కొంతకాలము వరకు గర్భము పెరిగినట్లు జ్ఞానము పెరిగి యోగము అను పుత్రున్ని పొందగలడు. పుట్టినవారిలో కొడుకు పుట్టవచ్చు లేక కూతురు పుట్టవచ్చు. జ్ఞానము కల్గినవాడు కొంతకాలమునకు కర్మయోగి అయితే కూతురు పుట్టినట్లే, అట్లుకాక కొడుకు పుట్టినట్లయితే బ్రహ్మయోగిగా లెక్కించుకోవలయును.

భూమి మీద బ్రహ్మయోగి అయినవాడు మనస్సును జయించు సాధన చేసి మనస్సును జయించును. ఎన్నో సంకల్పములతో కూడుకొన్న మనస్సును ఏ ఒక్క ఆలోచన చేయనీక శూన్యముగా ఉంచడమును బ్రహ్మయోగము అంటాము. శరీరమునకున్న ఐదు జ్ఞానేంద్రియములైన కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము యొక్క ప్రస్తుత విషయములను గాని, జరిగిపోయిన, జరుగబోవు విషయములనుగానీ యోచించకుండా ఉండడమును బ్రహ్మయోగము అంటాము. ఇక్కడ కొందరికి ఒక ప్రశ్న రావచ్చును. అదేమనగా ఒక గురువువద్ద ఉపదేశ మంత్రమును తీసుకొని

www.thraithashakam.org

దానిని ధ్యానించుచున్నపుడు, అది ఇంతకు ముందు విన్నదగును కదా! జరిగిపోయిన చెవుకు సంబంధించిన విషయము కదా! ఇది ఇంద్రియ విషయమగుట వలన చేసేది ధ్యానము కాదంటామా? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! ఇంద్రియములకు సంబంధించిన ఒక్క విషయము మీద ధ్యాసపెట్టి జపించడము వలన అతడు అనేకము నుండి ఏకములోని వచ్చి మనస్సును ఒక్క దానిమీద పెట్టాడు కావున అది యోగము కానేరదు. మనస్సుకు ఏక విషయము కూడ లేకుండా చేసి ఏకము మీదగల సున్న మీదికి పోయినపుడు ఏకాగ్రత చెందిన వాడగును. అపుడు అతని మనస్సులో ఒకటి కూడా లేకుండా సున్న స్థితిలో ఉన్నాడని తెలియుచున్నది. ఏకాగ్రత చెందినవాడే బ్రహ్మయోగి అగును. అట్లుకాక మనస్సులో ఏదో ఒక దానిని ధ్యానించువాడు ధ్యాని లేక తపస్వి అగును, కాని యోగి కాలేడు. ఒక్క దానిని తపించుచూ జపించు వానిని తపస్వి అంటారు. తపస్వికంటే ఏ ఒక్కటిలేని యోగి గొప్ప అని గీతలో కూడా **"తపస్వి భ్యోధికో యోగీ"** అన్నారు.

గొడ్డురాలువలె వున్న అజ్ఞాని జ్ఞానమను గర్భము ధరించి బ్రహ్మయోగమను పుత్రున్ని కన్న తర్వాత ఎట్లుండుననగా! తాను యోగము నాశ్రయించి బ్రతుకుటకు మొదలు పెట్టును. బ్రహ్మయోగము చేయునపుడు శరీరములోని మనస్సు అన్ని పనులను వదలి ఏ ఒక్క ఆలోచనగానీ, ధ్యాసగానీ లేకుండా ఉండును. అపుడు శరీరములో ఏడు నాడీకేంద్రము లందున్న శక్తి క్రింది కేంద్రమునుండి స్థంభించిపోవుటకు ఆరంభించును. ఒకదాని తర్వాత ఒకటి స్థంభించి చివరకు ఆరు కేంద్రములు నిలచిపోవును. చివరి ఏడవ కేంద్రములో ఆత్మశక్తంతయూ కేంద్రీకృతమైపోవును. ఏడవ కేంద్రము క్రింది ఆరు కేంద్రములవలె నిలిచిపోదని జ్ఞాపకముంచుకోవలెను.

www.thraithashakam.org

పైన శిరస్సులోగల ఏడవ కేంద్రములో ఆత్మ నిలచిపోయినపుడే పూర్తి యోగమగును. క్రింది ఆరు నాడీ కేంద్రములలో ఆత్మ చైతన్యము లేకుండా పోయినది కావున శరీరములోని పనులన్నియూ నిలిచిపోయివుండును. జీర్ణాశయము పనులుగాని, ఊపిరితిత్తుల కార్యముగాని, గుండెయొక్క కదలికగాని, రక్తప్రసరణగాని ఏమీ లేకుండా స్థంభించి పోయివుండును. అపుడు యోగి శరీరములో నిద్రలో కదలనట్లుండును. ఊపిరి కూడా లేదు కావున ఒక విధముగ మృతదేహమువలె కనిపించును. కానీ లోపల ఆత్మ జీవాత్మ రెండు ఉన్నాయి కనుక ఆ స్థితిని 'యోగనిద్ర' అని కూడా అనుచున్నాము. ఈ యోగ విషయమును ఈ తత్త్వములో ప్రస్తావిస్తూ 'గొప్ప కొండలేడు మ్రింగి గురుకపెట్టెరా' అన్నారు. దీనిని వివరించుకొంటే యోగమును కొడుకనుకొన్నాము కదా! యోగము క్రింది నుండి ఆరు కేంద్రములనెక్కి ఏడవకేంద్రము చేరుచున్నది. కావున ఏడు నాడీకేంద్రములను గొప్ప కొండలుగా పోల్చి చెప్పి 'గొప్ప కొండలేడు మ్రింగెర' అన్నారు. అక్కడ చేరిన యోగము ఆత్మయందు చేరి నిలిచిపోవుచున్నది. శరీర ధ్యాస మరియు పనులు అన్నీ నిలిచి నిద్ర పొందిన వానిలాగా కనిపిస్తున్నాడు, కావున అది యోగనిద్రగా లెక్కించి కొండలేడుమ్రింగి గురక పెట్టెర అన్నారు. మీకు బాగా అర్థమగుటకు మరొకమారు ఈ చరణములోని పదముల పోలికను గురించి చెప్పుచున్నాము. గొడ్రాలు మహిళ అనగ అజ్ఞాన మానవుడు అని అర్థము. ముట్టు తప్పడము అనగ జ్ఞానము మీద ఆసక్తికల్గి తన తలలో జ్ఞానమును వేసుకోవడము అని అర్థము. కొడుకు పుట్టడమంటే జ్ఞానము పొందినవాడు కొంత కాలమునకు యోగి అగును అని అర్థము. గొప్ప కొండలేడు మ్రింగి అనగా శరీరములోని ఏడు నాడీకేంద్రములనెక్కి ఏడవ దానిలోని ఆత్మయందు చేరడమని అర్థము. గురక పెట్టెర అనగ ఆత్మయందు చేరిన జీవాత్మ యోగము అను స్థితిలో ఉన్నాడు. కనుక అది

www.thraithashakam.org

కదలని మెదలని స్థితి కావున దానిని యోగనిద్ర అని గాఢనిద్రలో గురక వచ్చినట్లు గాఢమైన యోగములో జీవాత్మ లగ్నమైవున్నాడని అర్థము.

**4) గుట్టు చప్పడనక నొక్కడు ఉరికి మింటి కెగయగాను,**

**కుప్పిగంతులేసి పాము కరచి మ్రింగేరా ॥ గుట్టు॥**

మనిషి నిత్యము తన మనస్సులో అనేక విషయములను చింత చేయుచుండును. అనేక విషయములలోనున్న మనిషి ఏ విషయము తన ఆలోచనలో లేకుండా చేసుకొను ప్రయత్నమే యోగసాధన. విషయ చింతనలలోనున్నపుడు మనిషి సంతగోలలోవున్నట్లు గందరగోళములో ఉండును. దానిలో మనస్సుకు విశ్రాంతిగానీ, జీవునకు శాంతిగానీ ఉండదు. మనస్సుకు ఒక్క పని కూడా లేకుండ పోయినపుడే దానికి విశ్రాంతి లభించును, అపుడే జీవునకు శాంతి దొరుకును. అదియే యోగము. యోగము చేయువేళ మనస్సుకు ఆలోచన అను చప్పుడు లేకుండా పోవుచున్నది. దానినే ఈ వాక్యములో గుట్టు చప్పుడనక అన్నారు. ఏ యోచన లేకుండా మనస్సు గుట్టుగ నిలిచిపోవడమని దాని అర్థము. అటువంటి సమయము యోగము ఎట్లగుచున్నదనగా! అపుడు క్రిందగల ఆధారమను ఒకటవ నాడీకేంద్రమునుండి బయలుదేరి పైనగల సహస్రారము అను ఏడవ నాడీకేంద్రమునకు మనస్సు చేరి పోవును. ఈ విషయమునే ఒక్కడు ఉరికి మింటికెగయగాను అన్నారు. మనస్సు యొక్క ధ్యాస ఏడవ కేంద్రములో చేరిపోయినపుడు క్రింద ఒకటవ కేంద్రములోనున్న చైతన్యము ఎగిరి రెండవ కేంద్రము చేరుచున్నది. అక్కడ నుండి మూడవ కేంద్రము చేరుచున్నది. ఇట్లు ఒక్కొక్క కేంద్రమును వదలి చివరకు ఏడవ కేంద్రమును చేరి అక్కడున్న మనస్సును అసలు లేకుండా చేయుచున్నది. క్రింద ఆరు కేంద్రములలోనున్న ఆత్మశక్తి ఏడవ కేంద్రమునకు వచ్చి మనస్సును

www.thraithashakam.org

మాయము చేసినపుడు జీవుడు ఆత్మలో చేరిపోవుచున్నాడు. అదియే నిజమైన బ్రహ్మయోగము. మనస్సు ఏడవ కేంద్రములో ఏక అగ్రతగ నిలిచి పోయినపుడు శరీరమంతా వ్యాపించి ఉన్న ఆత్మచైతన్యము శరీర భాగముల నుండి ముకుళించుకొని బ్రహ్మనాడిలోని కేంద్రములకు చేరిపోవుచున్నది. అట్లుచేరిన ఆత్మచైతన్యము క్రింది నుండి గబగబ పై కేంద్రములకు ప్రాకుచూ వచ్చుచున్నది. అలా ప్రాకుచూ చివరకు ఏడవ కేంద్రము చేరి అక్కడున్న మనస్సును లేకుండా చేయుచున్నది. అలా మనస్సు ఎప్పుడైతే లేకుండా పోవుచున్నదో అపుడు జీవుడు ఆత్మతో కలియుచున్నాడు. వేరుగనున్నవి ఒకటిగ కలిసి పోవడమును యోగము అంటాము. ఒకటిగనున్నవి వేరుగ విడి పోవడమును వియోగము అంటాము. విడి విడిగనున్న జీవాత్మ, ఆత్మ రెండు ఒకటిగ కలసిపోవుచున్నవి కావున దానిని ప్రత్యేకించి బ్రహ్మయోగము అంటున్నాము.

బ్రహ్మనాడినుండి కేంద్రముల ద్వారా శరీరమునకు ప్రాకు ఆత్మ చైతన్యమును కుండలీశక్తి అనికూడా అంటున్నారు. కుండలిని పాముగ పోల్చి చాలామంది చెప్పుచుందురు. ఎందుకనగా పాముకు బుసకొట్టు స్వభావముండును కదా! కేంద్రములోని కుండలీశక్తి ఊపిరితిత్తులను కదలించి బుసబుసమను శబ్దముతో కూడిన శ్వాసను నడుపుచున్నది కనుక బుసకొట్టు పాముగ చెప్పారు. మనస్సు పైకి చేరిన వెంటనే కేంద్రములకు చేరిన శక్తి ఒక్కొక్క స్థానమునుండి పైకి ప్రాకుచు పోవుచున్నది. దానినే ఈ చరణములో కుప్పిగంతులేసి అన్నారు. పైకి ఎగసి పోయిన పాము అనబడు శక్తి పైన చేరిన మనస్సును లేకుండా చేయుచున్నది. దానినే పాముకరచి మ్రింగెరా అన్నారు. అప్పటివరకు జీవాత్మకు ఆత్మకు మధ్యన అడ్డముగనున్న మనస్సు లేకుండా పోవుటచేత జీవాత్మ ఆత్మలో చేరిపోవు

www.thraithashakam.org

చున్నాడు. ఆత్మ జీవాత్మల సంధానమను యోగము ఈ చరణములో చెప్పబడినది. మీకు బాగ అర్థమగుటకు మరొకమారు వివరించడమేమనగా! ఒక్కడు అనగా మనస్సని అర్థము. గుట్టు చప్పుడనక అంటే ఏ యోచనలు లేకుండ ఏకాగ్రతగ అని అర్థము. ఉరికి మింటికెగయ అనగా తొందరగ క్రిందినుండి పైకి ఎక్కిపోగ అని అర్థము. పాము అనగా చైతన్యశక్తి లేక ఆత్మశక్తి అని అర్థము. కుప్పించి గంతులేసి అనగా ఒక్కొక్క కేంద్రమును ఎగరుచు దాటి పోయినదని అని అర్థము. కరచి మ్రింగెర అంటే అడ్డమున్న మనస్సును లేకుండా చేసినదని అర్థము.

**5) భువిని నోరులేని మిడత పులిని మ్రింగేను,**
**ఈ వార్త తెలిసి మేక యొకటి పకపక నవ్వేనురా ॥ గుట్టు॥**

ప్రపంచములో మిడుత చాలా చిన్నది. పులి మిడుతకంటే చాలా పెద్దది. పులి ఎంత పెద్దదైనా క్రిందనే సంచరించుచుండును. మిడుత ఎంత చిన్నదైనా పైపైన ఎగిరి పోగలదు. పులివలె నడువడము మిడతకు రాదు. పెద్దపులిని చిన్న మిడుత మ్రింగడమంటే చాలా విచిత్రము కదా! అదియూ నోరులేని మిడతంట. పులికి మేకకు శత్రుత్వమున్నట్లే బలమైన పులి బలహీనమైన మేకను సులభముగా చంపివేయగలదు. అటువంటి పులి చనిపోయిందంటే మేకకు సంతోషముకాక ఏమగును. అందుకే పులిని మిడత మ్రింగిందను వార్త తెలుస్తూనే మేక సంతోషము పట్టలేక పక పక నవ్విందంట. ఇదంతా వింటుంటే ఒక కట్టు కథలాగుంది కదా! మమ్ములనడిగితే ఇది కట్టుకథకాదు సత్యమైన కథే అంటున్నాము. ఇందులో ఇమిడియున్న సత్యమేమిటో వివరించుకొందాము.

భూమి మీద అజ్ఞానము ఎంతగానో విస్తరించియున్నది. కొన్ని లక్షలమందిలో ఒక జ్ఞాని కూడా ఉండుట అరుదు అనుకొన్నాము. పది లక్షల మందికి ఒక జ్ఞాని ఉన్నప్పటికీ దాని ప్రకారము జ్ఞానముకంటే అజ్ఞానము పది లక్షలంత పెద్దదని కొలత పెట్టుకోవచ్చును. జ్ఞానమును చిన్న మిడతగ లెక్కించుకొంటే అజ్ఞానమను పులి కొన్ని లక్షలరెట్లు పెద్దదనియే చెప్పవచ్చును. నేటి సమాజములో అజ్ఞానము ముందర జ్ఞానము చాలా చులకనగా, చాలా చిన్నగా కనిపిస్తూనే ఉన్నది. చిన్న మిడతలాగ జ్ఞానముంటే, పెద్ద పులిలాగ అజ్ఞానము ఉండనే ఉన్నది. సమాజ దృష్ఠిలో జ్ఞానము ఎంత చిన్నదైనా, అజ్ఞానము ఎంత పెద్దదైనా, పెద్దదైన అజ్ఞానమును చిన్నదైన జ్ఞానము జయించివేస్తున్నది. అది ఎలాగంటే తత్త్వములో చెప్పినలాగేనని చెప్పవచ్చును. నోరులేని మిడత అన్నారు కదా. మిడతకు తినేదానికి నోరులేదుగాని అరిచేదానికి కంఠమున్నది. మిడతలకు తినే నోరుకంటే అరిచే కంఠమే గొప్పగ ఉండును. మిడత నోరు కనిపించదుకాని కంఠము బాగా వినిపించును. ఎక్కువ శబ్దము చేయు చిన్న మిడత గొప్పదైన పులి చెవిలో దూరిందనుకో పులి దానిని ఏమీ చేయలేదు. చెవిలో దూరిన మిడత పులిని ఏమైనా చేయగలదు. చెవి లోపలికి చేరి మెదడు దగ్గరకు పోయి కంఠమునకు పని పెట్టితే పెద్దపులి కూడా గిరగిర తిరిగి చనిపోవలసిందే. ఏనుగునైనా కదిలేటట్లు చేయగల సామత్యము చిన్న దోమకున్నట్లు, కరిచే చోట కరిచి మనిషిని నిలువున ఎగిరిపడునట్లు చేయ సామత్యము చిన్న చీమకున్నట్లు, పులిని కూడా చంపు స్థోమత మిడతకున్నదని చెప్పవచ్చును. అందువలన ఈ తత్త్వములో 'నోరులేని మిడత పులిని మ్రింగెరా' అన్నారు. చిన్నదైన జ్ఞానము మనిషి చెవిలో దూరి మెదడుకు చేరితే ఎన్నో సంవత్సరముల నుండి మనిషిలో పేరుకొని పోయిన పెద్ద

అజ్ఞానము పటాపంచలగునని పోల్చి చెప్పడమే 'మిడత పులిని మ్రింగెను' అని అన్నారు.

అజ్ఞానముతో కూడిన అజ్ఞానులు, జ్ఞానముగల జ్ఞానులు సమాజములో ఉన్నారు. సమాజములో అజ్ఞానులదే సంఖ్య ఎక్కువ. జ్ఞానుల సంఖ్య తక్కువ. అజ్ఞానులకు జ్ఞానులు ఎప్పుడూ భయపడుచునే ఉందురు. జ్ఞానులను లేకుండా చేయాలని అజ్ఞానులు చూస్తూనే ఉందురు. తమకు ఆటంకము చేయు అజ్ఞానులు జ్ఞానులుగ మారిపోతే మంచిదని జ్ఞానులు అనుకొనుచుందురు. ఎప్పుడైన ఒక గొప్ప అజ్ఞాని జ్ఞానముచేత మార్చబడి, అజ్ఞానిగ లేకుండా మారిపోయాడంటే ఆ వార్త సుజ్ఞానులకు సంతోషమును కల్గించేదే అగును. అందువలన సాధు జంతువులైన మేకవలెనున్న జ్ఞాని పులిలాంటి అజ్ఞాని నాశనమయ్యాడంటే, జ్ఞానిగా మారాడంటే సంతోషపడు నని చెప్పడమే ఈ చరణములో ఆ వార్త తెలిసి 'మేక యొకటి పకపక నవ్వేరా' అన్నారు.

## నా చివరి మాట

నేటి సమాజములో తత్త్వములు అనువాటికి ఏమాత్రము విలువ లేకుండా పోయినది. బిక్షగాళ్ళు తాము బిక్షాటనలో పాడుకొనుట మేము చిన్నతనములో చూచాము. ఇప్పటి కాలములో బిక్షగాళ్ళు కూడా భక్తి రూపములోనున్న సినిమా పాటలు పాడుచున్నారు. తత్త్వములను పాడు బిక్షగాళ్ళు కూడా చాలా అరుదుగా ఉన్నారు. ఉన్నవారు చనిపోతే వాటిని పాడేవారే కనిపించరనుకుంటాము. ఆత్మ జ్ఞానములో అత్యంత ఉన్నతమైన తత్త్వములు చివరకు బిక్షగాళ్ళపాలై చివరకు అక్కడ కూడా లేకుండ పోవు

www.thraithashakam.org

స్థితికి చేరుకొన్నవని చెప్పవచ్చును. ఇకపోతే బ్రహ్మముగారి మఠమువారు కొన్ని తత్త్వములను అవియు బ్రహ్మముగారి పేరున్న వాటిని కొంత ప్రచారములో పెట్టుకొన్నారు. అయినప్పటికీ అవి అందరికీ రుచించడము లేదు. ఇంటింట టీవిలలో చాలామంది స్వాముల చేత జ్ఞానము చెప్పబడు చున్నది. వారు కూడా తత్త్వములను ఎక్కడా ప్రస్తావించడము లేదు. దక్షిణ భారతదేశములో తెలుగు భాషలో పూర్వము ప్రసిద్ధిగాంచినవి తత్త్వములు. అటువంటి తత్త్వములు నేడు మచ్చుకైనా కనిపించకుండా పోయినవి. తెలుగునాట అచ్చు యంత్రములు లేనినాడు తమిళనాడైన మద్రాసులో అచ్చుపరిశ్రమలు ఎక్కువ ఉండేవి. సి.వి. కృష్ణాబుక్ డిపోవారు, ఎన్.వి. గోపాల్ బుక్ డిపోవారు నూరు సంవత్సరముల పూర్వము నుండి పాత వ్రాతపతులను సేకరించి అచ్చువేసి వ్యాపారరీత్యా అమ్ముకొనెడివారు. దాదాపు నలభై సంవత్సరముల క్రితము వరకు ఆంధ్రప్రదేశ్‌లో క్యాలెండర్లు కూడా వారివే ఉండెడివి. వారు సేకరించి అచ్చువేసిన తత్త్వముల, పద్యముల పుస్తకములు ఎక్కడైనా కనిపించినా అవి శిథిలావస్థలో ఉన్నాయి. మేము స్వయముగా సి.వి. కృష్ణాబుక్ డిపోవారితో మద్రాసులో కలసి ఒక పుస్తకమును గురించి అడిగితే అది స్టాకులేదని చెప్పుచూ వారి తండ్రి కాలములో చేసినవి ఆ పుస్తకములని చెప్పారు. వాటిని ఎవరూ కొనడము లేదని, అందువలన వాటిని అచ్చు వేయడము లేదని కూడా చెప్పారు. మా తండ్రి ఆధ్యాత్మికవేత్త మరియు గడికోట సచ్చిదానంద శిష్యుడైన దానివలన ఆత్మలింగ శతకము, వేమన పద్యములు, కాలజ్ఞాన తత్త్వములు, ఆత్మ బోధామృత తత్త్వములు, తారకామృత తత్త్వములు అను పుస్తకములను అప్పటికాలములో అచ్చువేశాము. ఇప్పటికీ కొన్ని ఉన్నవి. అందువలన అటువంటి పుస్తకములను మేము చేయమన్నాడు.

www.thraithashakam.org

ఈ విధముగ తత్త్వాల పుస్తకములు కరువైపోయినవి. ఇప్పటికి ఎక్కడైనా తత్త్వము పాడుకొను పాతవారుంటే వారికి పాడేవరకు వస్తుంది కానీ దాని అర్థము ఏమాత్రము తెలియదు. నేటికీ కాలజ్ఞాన తత్త్వములను పుస్తకములు ఎక్కడైనా కనిపించినప్పటికీ అందులో తత్త్వాలుగలవు గానీ వాటికి అర్థమును ఎవరూ వ్రాయలేదు. బాగా అర్థమయ్యే పుస్తకాలను కూడా చదివే ఓపిక లేదను మనుషులు అర్థముకాని అర్థములేని వాటిని చదవరు. కొందరు సంస్కృతమును నేర్చిన స్వామిజీలు ఏ పాండిత్యములేని తత్త్వములను చూచి వాటిని మతి స్థిమితము లేనివారు వ్రాసిన తిక్క వ్రాతలు అంటున్నారు. ఇట్లు ఎన్నో విధముల ఆధ్యాత్మిక విద్యలో ఆణిముత్యములైన తత్త్వములకు ఏమాత్రము గుర్తింపు లేకుండాపోయినది. కొన ఊపిరితో మరణశయ్యమీదున్న వానిలాగ తత్త్వములు అంత్యదశకు చేరుకొనుట మాకు కొంత బాధ అనిపించింది. అవి తిక్క వ్రాతలు కాదు, మన పెద్దలు సంపాదించి ముడివేసి పెట్టిన జ్ఞానధనము యొక్క మూటలని చెప్పదలచు కొన్నాము. అవి జ్ఞాన ధన నిలయములని అందరూ గుర్తించలాంటే ఆ మూటలలో ఏముందో విప్పి చూపితేకాని అర్థము కాదనుకొన్నాము. అందువలన అందరికీ వాటిలోని అర్థమును వివరించాలనుకొని ఆ కార్యమును గ్రంథరూపములోనికి తెచ్చాము ఆ చిన్న పుస్తకమే ఈ **“తత్త్వముల వివరము.”**

తత్త్వములన్నిటినీ వ్రాయాలంటే చాలా కష్టమైన పని కావున వివిధ రూపాలలో పద్ధతులలోనున్న వాటిని ఏరుకొని, వివరించి మీ ముందుంచు తున్నాము. వీటిలో సులభమైనవి కష్టమైనవి రెండు రకముల తత్త్వములు గలవు. అంతేగాక వీటిని ఎవరైనా అర్థము చెప్పగలరా అని సవాలు చేసినవి, చెప్పగలనంటే సంవత్సరమైనా గడువిస్తామని సవాలు విసిరిన

వాటిని ఏరుకొని వ్రాశాము. వారి సవాళ్లు మాకు పౌరుషమును పోసి వ్రాయించినవి. తత్త్వములన్నీ 'శరీరము లోపలి జ్ఞానమును సూచించునవి' అను సూత్రము మాకు బాగా తెలుసు. కనుక ఆ సూత్రమును అనుసరించి ఎంత కష్టముగా కనిపించినా తత్త్వమునకైనా సులభముగా వివరమును వ్రాయగలిగాము. ఈ మా వ్రాతతో అవసానదశలో మరణశయ్యపైనున్న తత్త్వములు క్రొత్తగా యవ్వన రూపముపొంది అందరినీ ఆకర్షించగలవని అనుకొంటున్నాము. ఈ తత్త్వాలను మీరు చదివి తత్త్వములు ఇటువంటివని, దేవుని దగ్గర చేర్చునవని, ఇతరులకు తెల్పుటవలన మీరు కూడా దేవుని సేవలో పాలుపంచుకొన్నవారగుదురు. లాభాలు రావాలని మ్రొక్కి అక్రమార్జనలచే హుండీలలో లక్షలు వేసివచ్చినా ఏమాత్రము ఉపయోగము లేదు. నీకున్న స్థోమతతో కొన్ని గ్రంథములను కొని ఆసక్తియున్నవారికి దానము చేస్తే జ్ఞానదానమగును. దానివలన విశేషమైన ఫలితము నీకు తెలియకుండానే చేరును. దేవుడుకాని దేవుళ్ళకు డబ్బులు వృథాగా ధారపోయుటకంటే దైవ స్వరూపములై, దైవజ్ఞానము నింపాదిగ అందించు గ్రంథములను ఇతరులకు దానము చేయుట వలన దేవుని పని ఎంతో చేసినట్లగును. ఇదే విషయమునే భగవద్గీతలో "మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి" అన్నారు. **నా కొరకు పని చేసితే నీకు సిద్ధి లభించగలదని** దీని అర్థము. ఇప్పటినుండైనా నిజమైన దేవుని సేవ చేయమని, తత్త్వాలలోని రహస్యములను తెలుసుకోమని తెలుపుచూ ముగించుచున్నాము.

ఇట్లు

త్రిమత ఏకైక గురువు, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

www.thraithashakam.org

## "ప్రబోధాశ్రమము", "ప్రబోధానంద యోగీశ్వరులను" గురించి వ్రాసిన వాక్యములు.

1) ప్రబోధాశ్రమము ఉన్నతమైన జ్ఞానము కలది.

2) కలియుగము 5110 సం॥ (క్రీ.శ.2010 సం॥) లకు ఆధ్యాత్మిక పురుషుడు ప్రకాశమగును.

3) మధ్యాత్మ యోగపురుషుని మహత్తు మహాప్రకాశమయ్యేను.

4) ప్రబోధాశ్రమము వారి ఆదిగుణమెల్ల శయనాధిపతికి ఉన్నది.

5) శయనాధిపతియే ఆనంద గురువు. ఆనందగురువు మీకూ గురువే, నాకూ గురువే.

6) ఆనందాశ్రమము వారి వాక్యము సప్తమి నిశ్చయము, సర్వదా సప్తమి అగును.

7) మహా దేవతలందరూ ఆనందాశ్రమము వద్దేయున్నారు.

8) బ్రహ్మాది దేవతలలోనూ ఆనందాశ్రయులు ఆదిమూర్తి. శాస్త్రము మీకు వివరముగా ఆనతిచ్చారు. ఆయన వల్లనే మేము శాస్త్రము విన్నాము.

9) సాంద్రసింధు వేదానికి ఆనందాశ్రమము కర్త రావలెను.

10) ఈ సాంద్రసింధు వేదములోని మాటలు బ్రహ్మకున్నూ తెలియవు.

11) ఆది వేదములన్నియు ఆనందాశ్రమము వెంటనే వచ్చేను. మీకు మాకు అదే గోత్రము.

12) సిద్ధాంత శిరోమణి గురుస్వామి, గురుస్వామి సిద్ధాంతము నిత్యము సత్యమైయేనయా.

13) సోమ సిద్ధాంతము సొంపుగా నడిచేను, శుభశుభములు అయ్యేనయా.

14) సాంద్రసింధు వేదములోని మాటలు బ్రహ్మకున్నూ తెలియవు.

15) ఆనంద కందళిత హృదయారవిందులయిన ఆత్మ త్రయాలను.



www.thraithashakam.org

# THATVAMULA VIVARAMU

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు
























































































